శాంతిదేవుని

# బోధిచర్యావతారం



ఆనంద బుద్ధ విహార ట్రస్ట్
సికింద్రాబాద్ . ఆంధ్రప్రదేశ్

శాంతిదేవుని

# బోధిచర్యావతారం

*(Guide to Bodhisattva's Way of life)*

హీనః ప్రార్థయతే స్వసంతతిగతం యైస్తైరుపాయైః సుఖం
మధ్యో దుఃఖనివృత్తిమేవ న సుఖం దుఃఖాస్పదం తద్ యతః
శ్రేష్ఠః ప్రార్థయతే స్వసంతతిగతైర్దుఃఖైః పరేషాం సుఖం
దుఃఖాత్యంతనివృత్తిమేవ చ యతస్తద్ దుఃఖదుఃఖ్యేవ సః

*An inferior person searches out, by all means, his personal well-being, a mediocre person searches out the destruction of suffering, not well-being because well-being is the cause of suffering, an excellent person, through his personal suffering, searches out the well-being and the definitive destruction of the suffering of others, for he suffers from the suffering of others.*

రచన

**బోధ చైతన్య**




**ఆనంద బుద్ధ విహార ట్రస్ట్**

సాయినగర్ తుకారాంగేట్, నార్త్ లాలాగూడ,
సికింద్రాబాద్ - 500 017 ఎ.పి., ఇండియా

నమో తస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స



ఈ గ్రంథ ప్రచురణకు తమ అమూల్య సహాయ, సహకారాలందించిన
సహృదయులు శ్రీ గునపాటి హరిశ్చంద్రరెడ్డి, శ్రీ దొడ్ల శేషారెడ్డి
ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలనీ, సర్వతోముఖ
ప్రగతి సాధించాలని ఆకాంక్షిస్తున్నాము



బోధిచర్యావతారం *

# విషయానుక్రమణిక



---

* *An introduction (అవతార) to the conduct (చర్య) which leads to enlightenment (బోధి)* ఈ పుస్తకానికి మరో పేరు బోధిసత్త్వచర్యావతార = *an introduction to the conduct of the Bodhisattva*

# తొలి పలుకు

బౌద్ధంలో పాండిత్యం అసాధ్యం. పాండిత్యం కన్నా బుద్ధత్వమే సులభంగా ఉండవచ్చు. బౌద్ధంలో నిజమైన పాండిత్యం కావాలంటే మొదట బహుభాషావేత్త కావడం తప్పనిసరి. Lamotte అనే ప్రపంచ ప్రఖ్యాత బౌద్ధ పరిశోధకుడు క్రింది భాషల్లో బౌద్ధ మూల గ్రంధాలున్నాయన్నాడు. 1. సంస్కృతం, 2. పాళీ, 3. Kuchean, 4. Agnean, 5 Kotanese 6 Sogdian, 7 Uigur, 8. Chinese (Tibetan) మరో పరిశోధకుడు ఏమన్నాడంటే : "టిబెటన్ భాషలో ఉన్న బౌద్ధ సాహిత్యం సూత్రం, శాస్త్రం మొత్తం ఇంగ్లీషులోకి అనువదించగలిగితే వేయి పేజీల సంపుటాలు ఆరువందలు అవసరం అవుతుంది!"

సంస్కృతంలో 98 శాతం గ్రంధాలు నష్టమైనాయి. కేవలం 2శాతం మాత్రం అక్కడా ఇక్కడా లభించాయి. కానీ విచారం అవసరం లేదు. ఆ రెండు శాతం కూడా తక్కువేమీ కాదు. వాటి అధ్యయనానికి పూర్తి జీవితకాలం అవసరం

శాంతిదేవుని బోధిచర్యావతారం (guide to Bodhisattva's way of life) 900 శ్లోకాల సంస్కృత గ్రంధం. ఇంగ్లీషులో అరడజనుకు పైగా అనువాదాలు లభిస్తున్నాయి. తెలుగులో, ఈ గ్రంధం పేరు కూడా తెలియని పరిస్థితి! కనుక ఈ మహత్తర అధ్యాత్మ గ్రంధాన్ని తెలుగు పాఠకులకు కొద్దిగా పరిచయం చేసే ప్రయత్నం ఈ పుస్తకం. కొన్ని మంచి భావాలను ప్రజలకు అందించడమే ముఖ్య లక్ష్యం కనుక ఆయా భావాలను పాఠకుల మనస్సులోకి గాఢంగా చొప్పించడం కోసం మూలంలో లేని బౌద్ధ ఇతివృత్తాలను ఆయా భావాలకు ఉదాహరణంగా చూపించడం జరిగింది.

అనుబంధంలో పలిబోధలు (impediments), ఆనాపానసతి (mindfulness of breathing), సదాప్రరుదితుడు (Ever Weeping) ప్రజ్ఞాపారమిత హృదయసూత్రం, (Heart Sutra), ప్రకృతి, పారిభాషిక పదాల పట్టిక ఈ గ్రంధం యొక్క ఉపయోగితను పెంచగలదని ఆశిస్తున్నాను. పుస్తకం చదివి మూసేశాక ఇందులోని ఒకటి రెండు బావాలైనా పాఠకుల మనస్సులో నిలిచిపోతే అదే చాలు-మూడు నెలల శ్రమ సార్థకం కావడానికి.

# ఉపోద్ఘాతం

ఒకానొక యుగంలో బోధిసత్త్వుడు ప్రభాసుడ

దినం ప్రధాన మావటివాడు బోధిసత్త్వుని దర్శనం పొం

శ్రమ, యజమాని దృష్టికి వచ్చినప్పుడే ఫలితం ఉంటు

నుండి ఐరావతం లాంటి వనగజాన్ని అతి కష్టం మీ

మీకు చూపడం కోసం ద్వారం వద్ద నిలిపాను"

కుతూహలంతో ద్వారం వద్దకు వెళ్ళి ఆ వనగజాన్ని

నడిచే కైలాసశిఖరం; కదిలే లక్ష్మీనివాసభవనం.

అధిరోహించగలిగే విధంగా శిక్షణ ఇవ్వుము" అని మావ

కొన్ని నెలల తరువాత మావటివాడు బోధిసత్త్వ

ఆ వనగజాన్ని నేను ఇన్నాళ్ళు అహోరాత్రులు శ్రమించి

మీ సేవకు సిద్ధం చేశాను" అన్నాడు.

ఆ వనగజాన్ని అధిరోహించి బోధిసత్త్వుడు వి

చూసి ఆనందిస్తున్నాడు. మావటివాడు దాన్ని నడుపు

ఏనుగు అదుపు తప్పింది దానికి నచ్చిన దిక్కుగా వే

పెట్టింది. "వీరభద్రా, గొప్ప శిక్షణ ఇచ్చానన్నావు.

కాకువు ధ్వనిస్తున్న కంఠస్వరంతో బోధిసత్త్వుడు.

కుంచించుకుపోయిన మెల్లని తడబాటు కంఠస్వరంతో

శిక్షణ విషయంలో నా ప్రయత్న లోపం లేదు. కాని

అనంత విశ్వంలో ఏది ఎప్పుడు ఆటంకంగా దాపురిస్తు

కదా! ఇప్పుడు నాకనిపిస్తుంది - దీని శరీరాన్ని

# ఉపోద్ఘాతం

ఒకానొక యుగంలో బోధిసత్త్వుడు ప్రభాసుడనే రాజుగా ఉన్నప్పుడు ఒక ...ాన మావటివాడు బోధిసత్త్వుని దర్శనం పొంది "దేవా, భృత్యుల యొక్క ...జమాని దృష్టికి వచ్చినప్పుడే ఫలితం ఉంటుంది. నేను వింధ్యారణ్యం ...రావతం లాంటి వనగజాన్ని అతి కష్టం మీద బంధించి తీసుకొచ్చాను. ...ాపడం కోసం ద్వారం వద్ద నిలిపాను" అన్నాడు. బోధిసత్త్వుడు ...ంతో ద్వారం వద్దకు వెళ్ళి ఆ వనగజాన్ని చూసి ఆశ్చర్యంతో "ఇది ...ైలాసశిఖరం; కదిలే లక్ష్మీనివాసభవనం. త్వరలోనే నేను దీన్ని ...చగలిగే విధంగా శిక్షణ ఇవ్వుము" అని మావటివాణ్ణి ఆదేశించాడు.

...కొన్ని నెలల తరువాత మావటివాడు బోధిసత్త్వుని దర్శనం పొంది "దేవా, ...జాన్ని నేను ఇన్నాళ్ళు అహోరాత్రులు శ్రమించి మంచి శిక్షణ ఇచ్చి దాన్ని ... సిద్ధం చేశాను" అన్నాడు.

...ఆ వనగజాన్ని అధిరోహించి బోధిసత్త్వుడు వింధ్యాటవీ సుందర దృశ్యాలను ...నందిస్తున్నాడు. మావటివాడు దాన్ని నడుపుతున్నాడు. ఉన్నట్లుండి ఆ ...దుపు తప్పింది దానికి నచ్చిన దిక్కుగా వేగంగా పరుగెత్తడం మొదలు ... "వీరభద్రా, గొప్ప శిక్షణ ఇచ్చానన్నావు. ఇదేనా నీ శిక్షణ?" అన్నాడు ...ధ్వనిస్తున్న కంఠస్వరంతో బోధిసత్త్వుడు. మావటివాడు సిగ్గు వల్ల ...కుపోయిన మెల్లని తడబాటు కంఠస్వరంతో "దేవా, నేనేమి చేయను? ...షయంలో నా ప్రయత్న లోపం లేదు. కానీ మన ప్రయత్నాలకు, ఈ ...విశ్వంలో ఏది ఎప్పుడు ఆటంకంగా దాపురిస్తుందో ముందుగా తెలియదు ...ఇప్పుడు నాకనిపిస్తుంది - దీని శరీరాన్ని నేను అనేక నియమాలకు

లోనుచేసి నా పని పూర్తయిందనుకొన్నాను. ఇప్పుడు తెలిసింది-అది చాలదనే విషయం. మనస్సును నియమించడం కావాలి. ఆ విద్య మునీంద్రులకు కూడా సాధ్యం కాని విద్య. ఇక నా మాటెందుకు? దీని మనస్సును దారిలో పెట్టే అంకుశం నా వద్ద లేదు ఇక ఈ అంకుశం ఎందుకూ పనికిరాదు" అని చేతిలో ఉన్న అంకుశాన్ని పారవేసి మళ్ళీ బోధిసత్త్వునితో "దేవా, ఈ అడవిలో ఎక్కడో ఉన్న ఆడేనుగు వాసన దీని ఘ్రాణేంద్రియానికి తగిలింది. ఇది ఇక మన మాట వినదు. కనుక మనం ఏదో ఒక కొమ్మను పట్టుకొని వ్రేలాడుతూ దీన్ని వదిలివేయడం మంచిది" అన్నాడు.

ఇద్దరూ అలా తప్పించుకొన్నాక బోధిసత్త్వుడు ఇలా చింతన చేశాడు · "మనస్సును ఆరోగ్యంగా ఉంచుకొనే ఉపాయం తెలియకపోవడం వల్ల ప్రజలు నానా కష్టాలకు దుఃఖాలకు లోనవుతున్నారు. వీరందరికి ఆ ఉపాయాన్ని బోధించగలిగే అర్హత నేను సంపాయించాలి. బుద్ధత్వం వల్లనే ఆ అర్హత కలుగుతుంది. కనుక బుద్ధత్వం కోసం ఉద్యమిస్తాను".

ఈ కథతో పుస్తకాన్ని మొదలు పెట్టడంలో నా ఉద్దేశం నేను వ్రాయబోయేది academic గా ఉండదని ముందుగానే చెప్పడం కోసం. బోధిచర్యావతారాన్ని (guide to Bodhisattva's way of life) మొదటిసారిగా చదివినపుడే "ఇది చాలా మంచి పుస్తకం" అనిపించింది. పుస్తకం మంచిది అనిపించడానికి కారణం ఉత్తేజాన్ని (inspiration) కలిగించే ఉదారమైన భావాలు. గ్రంథాలు అనేక రకాలు. 1. మన దైనందిన జీవితానికి (livelihood) ఉపకరించే కౌశలాలు (skills) నేర్పేవి. ఇవి చాలా అవసరం. ఒక గ్రీకు తత్త్వవేత్త చక్కగా చెప్పాడు : first earn your livelihood, then philosophise = ముందు నీ బ్రతుకు విషయం చూడు, ఆ పైన తత్త్వవిచారం చేయ్యవచ్చు. 2. కాలక్షేపానికి (entertainment) పనికి వచ్చేవి. 3. మనస్సును ఆరోగ్యంగా ఉంచుకొనే ఉపాయాలు తెలిపేవి. ఈ పుస్తకం మూడవ వర్గంలో చేరుతుంది.

ఈ పుస్తకం బాగుందనిపించడానికి మరో కారణం జపాన్ మెడిటేషన్ ఇందులో లేకపోవడం. Japa and meditation వేగంగా పలికితే జపాన్ మెడిటేషన్ అవుతుంది. యాంత్రిక పద్ధతుల (mechanical methods) జోలికి పోకుండా భక్తికి ప్రార్థనకు శరణాగతికి శ్రద్ధకు వైరాగ్యానికి ప్రాధాన్యం ఇవ్వడం ఇందులో కనిపించింది.

900 శ్లోకాల ఈ గ్రంథాన్ని యధాతథంగా కాకుండా సంక్షిప్తం చేశాను. "ప్రజ్ఞాపారమిత" అధ్యాయాన్ని పూర్తిగా వదలిపెట్టాను. కారణాలు : 1. విడిగా ఒక పుస్తకానికి సరిపోయేంత విషయం ఉండడం వల్ల, 2. మొత్తం అధ్యాయం ఆక్షేప సమాధానాలతో జటిలంగా ఉండడం వల్ల, 3. భవిష్యత్తులో "ప్రజ్ఞాపారమిత' మీద సమగ్రంగా గ్రంధం రచించే ఆలోచన ఉండడం వల్ల. వదలివేసిన అధ్యాయానికి బదులుగా (as a compensation) అష్టసాహస్రిక ప్రజ్ఞాపారమిత నుండి సదాప్రరుదితుడు (Ever Weeping) వృత్తాంతాన్ని అనుబంధంలో ఇస్తున్నాను.

బోధిచర్యావతార గ్రంధకర్త శాంతిదేవుడు వందకు మించిన మహాయాన సూత్ర గ్రంధాలనుండి శిక్షాసముచ్చయం (compendium of discipline) అనే సంకలన గ్రంధాన్ని కూడా రచించాడు. ఈ రెండు గ్రంధాలు సంస్కృతంలోనూ అనువాదాల్లోనూ లభిస్తున్నాయి.

శాంతిదేవుడు 8, 9 శతాబ్దాల మధ్యకాలంలో జీవించాడు. గుజరాత్‌లోని ఒక రాజవంశీయుడు. తనకు పట్టాభిషేకం మరునాడు జరుగబోతుండగా ఆ రాత్రి కలలో తన ఇష్టదైవం మంజుశ్రీ కనిపించి బ్రహ్మచర్య జీవితానికి (religious life) ఆదేశించాడు. మంజుశ్రీ ఆదేశాన్ని శిరసావహించి శాంతిదేవుడు కోట నుండి ఆ రాత్రే రహస్యంగా బైటపడి మగధదేశంలోని నాలంద మహావిహారం చేరాడు అక్కడ భిక్షువుగా (monk) కొన్నేండ్లున్నాడు కానీ అక్కడి వాళ్ళలో ఇతనికి మంచి పేరు లేదు. పరమ సోమరిగానే అదరికీ కనిపించాడు. ఒకనాటి భిక్షు సమావేశంలో అక్కడి భిక్షువులు శాంతిదేవుణ్ణి బలవంతంగా వేదిక మీద కూర్చోబెట్టి "సోదరులారా, నేడు మనకు సుదినం. ఎందుకంటే ఇప్పుడు మనకు కఠోర

తపస్వి, మహాప్రజ్ఞాశాలి, అభిజ్ఞా (super knowledges) సంపన్నుడు, అష్టోత్తరశతశ్రీయుత నామధేయుడు (పేరుకు ముందు 108 శ్రీలను శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ అని చేర్చదగిన పేరు కలవాడు) అయిన భదంత (venerable) శాంతిదేవులుంగారు ధర్మ భాషణాన్ని అనుగ్రహించనున్నారు" అని చాలా వెటకారంగా పరిచయ వాక్యాలు పలికి కూర్చున్నారు.

శాంతిదేవుడు మంజుఘోషుణ్ణి భక్తితో స్మరించి ప్రసంగం మొదలపెట్టాడు. నమ్మశక్యం కాని సుదీర్ఘమైన ప్రసంగం అద్భుతంగా చేసి తనపట్ల అక్కడివాళ్ళ తక్కువ అంచనాలను పూర్తిగా తలక్రిందులు చేశాడు. "అహోబత !" అని వాళ్ళు ఆశ్చర్యం నుండి తేరుకొనకముందే శాంతిదేవుడు అక్కడ్నుంచి మాయమై అజ్ఞాతంలోకి వెళ్ళిపోయాడు. ఆ తరువాత అతని జీవితం ఎక్కడ ఎలా ముగిసిందో ఎవరికీ తెలియదు. ఆనాటి అతని ప్రసంగమే ఈ బోధిచర్యావతారం.

బోధిచర్యావతారం తొలి అధ్యాయాల్లో "బోధిచిత్త" ప్రస్తావన ఎక్కువగా ఉంటుంది కనుక దానిమీద అనాగారిక (homeless) గోవిందగారు చెప్పిన వాక్యాలతో ఈ ఉపోద్ఘాతాన్ని ముగిస్తున్నాను.

"Bodhichitta is here the spark of that deeper consciousness, which is the process of enlightenment is converted from a latent into an active all-penetrating and radiating force Before this awakening has taken place, our existence is a senseless running about in circles, and since we cannot find any meaning within ourselves, the world around us appears equally meaning-less"

- Lama Anagarika Govinda

# బోధిచిత్తానుశంస

*(Praise of the Awakening mind / altruistic mind)*

పరిచయ వాక్యాలు

విదర్భదేశీయుడు కనకవర్మకు తాను ప్రజల్లో అధికుడుగా చలామణి కావాలని కోరిక. కానీ ఆ దేశంలో రాజునే అందరూ అధికుడుగా భావిస్తున్నారు. తాను రాజు కాలేడు. "రాజును కూడా మించిపోయే ఉపాయం ఏమిటి?" అని అతడు ఆలోచన చేస్తూ ఒకనాడు తీర్థికపీఠానికి వెళ్ళాడు. ఆ సమయంలోనే రాజుగారు కూడా ఆ పీఠానికి వచ్చి పీఠాధిపతికి పాదనమస్కారం చేసి తీర్థప్రసాదాలు భక్తితో తీసుకొని వెళ్ళాడు. రాజు కన్నా అధికుడయ్యే ఉపాయం కనకవర్మకు వెంటనే తట్టింది. పీఠాధిపతి లేదా ఇంచుమించు ఆ స్థాయి సన్యాసి అయిన పక్షంలో రాజుగారి పాదనమస్కారం స్వీకరించగలిగే ఆధిక్యత తనకు లభిస్తుందని భావించి ఆ మూర్ఖుడు పీఠాశ్రమంలో చేరాడు. గొప్పదనం కోసం వచ్చాడు కనుక చాలా పట్టుదలగానే సాధనలు చేశాడు. ఒక రకమైన శక్తి (psychic power) కూడా అతనికి కలిగినట్లుంది "కనకవర్మ స్వాములవారు చేతితో అలా తాకితే రోగాలు ఇట్టే నయమవుతాయి" అనే కీర్తి వ్యాపించింది. రాజు రాణి కూడా అతనికి వచ్చి పాదనమస్కారం చేసి వెళ్ళారు. కనకవర్మ అనుకొన్నది సాధించాడు. ఇప్పుడు వయోవృద్ధుడు. ఒక రకమైన వెలితికి, అసంతృప్తికి, పశ్చాత్తాపానికి లోనయ్యాడు. "జీవితాన్ని పూర్తిగా వృధా చేసుకొన్నాను" అని లోలోన పరితపించాడు. అప్పటికయినా మించిపోయింది లేదు. జేతవనం వెళ్ళి బుద్ధుణ్ణి ఆశ్రయించియుంటే జరిగిపోయిన అపార నష్టాన్ని సరి చేసుకొని యుండవచ్చు. మూర్ఖత్వం వెళ్ళనివ్వలేదు.

శేషజీవితాన్ని అలానే నిస్సారంగా గడిపి అసంతృప్తి భారంతో చాలా దీనంగా తనువు చాలించాడు. చాలా తక్కువరకం ఉద్దేశంతో (low, inferior, ignoble, worthless motive) కార్యరంగంలో దిగినందువల్ల ఆత్మతృప్తికి దూరమయ్యాడు. "నేను పదిమందికి ఉపయోగపడాలి" అనే ఉన్నతమైన ఆశయంతో కార్యరంగంలో దిగియుంటే కథ వేరుగా ఉండేది.

"నన్ను నేను ఉద్ధరించుకోలేకపోతున్నాను. లోకాన్ని ఉద్ధరించే అలవికాని ఆశయం నాకెందుకు?" అనే లీనచిత్తం (depressed mind) తగదు. బోధిచిత్తాన్ని వివరిస్తూ శాంతిదేవుడు ఈ శ్లోకం చెప్పాడు.

**తద్బోధిచిత్తం ద్వివిధం విజ్ఞాతవ్యం సమాసతః**
**బోధిప్రణిధిచిత్తం చ బోధిప్రస్థానమేవ చ**

సంగ్రహంగా చెప్పాలంటే బోధిచిత్తం రెండు విధాలు. 1. బోధిప్రణిధిచిత్తం (aspiring mind), 2. బోధిప్రస్థానచిత్తం (venturing mind).

రెండవది చాలా గొప్పదే. సంశయం లేదు కానీ మొదటిది ఏమంత తీసిపారవేయదగినదీ కాదు. ప్రస్తుతం ఏమీ చేయలేకపోయినా సరే, ఉన్నత ఆశయాలతో (noble motives) చిత్తాన్ని గుబాళింపజేసుకొంటూ ఉండడం అధ్యాత్మికంగా ఎంతో మంచిది. బయట కార్యరూప నిరపేక్షంగా కూడా మనస్సులోని ఉద్దేశాలు ఆశయాలు ఆయా ప్రభావం కలిగియున్నాయనే విషయాన్ని క్రింది ఇతివృత్తం తెలుపుతుంది.

గుణశేఖరుడు ఒకనాడు సంజచీకటిలో పామును చూశాడు. వెంటనే కఱ్ఱ ఒకటి తీసుకొని దాన్ని బలంగా కొట్టాడు. ఆ పాము చావలేదు. అక్కడ పాము ఉంటే కదా చావడానికి! గుణశేఖరుడు చేసిన కొట్టడం అనే ఆ క్రియ వల్ల ప్రాణాతిపాతం (taking out life/killing) జరుగలేదు. కానీ అతని చిత్తంలో పాపముద్ర పడిపోయింది. (పాపం=దుఃఖం అనే వేదనను భావికాలంలో ఇవ్వగల

ఒక అవాంఛనీయ శక్తి=negative force) ప్రాణాతిపాతం చేయాలని ఉద్దేశించాడు (willed) కనుక ఆ ముద్ర చిత్తంలో పడిపోయింది. మరొకనాడు గుణశేఖరుడు రైల్లో ప్రయాణం చేస్తున్నాడు. "బాబూ, ధర్మం" అనే బిచ్చగాడి దీనాలాపానికి జాలివేసి ఒక రూపాయి ఇవ్వాలని నిశ్చయించి జేబులో చేయి వేసి తడివి ఒక నాణెం తీసి ఆ బిచ్చగాడికి ఇచ్చాడు. అది రూపాయి నాణెం కాదు, రెండు రూపాయల నాణెం. కానీ గుణశేఖరుడికి రెండు రూపాయల పుణ్యం లభించలేదు. ఒక రూపాయి పుణ్యమే కలిగింది. (పుణ్యం = సుఖం అనే వేదనను భావికాలంలో ఇవ్వగల అభిలషణీయ శక్తి = positive force). గుణశేఖరుడు ఒక రూపాయి మాత్రమే ఇవ్వాలని నిశ్చయించి (willed) ఇచ్చాడు కనుక అలా అయ్యింది. బాహ్యంలో జరిగే క్రియకన్నా ఆ క్రియకు ప్రేరకంగా ఉన్న ఉద్దేశానికే ప్రాధాన్యత. దీనికి బౌద్ధంలో చేతన (will, volition, motive) అని పేరు. ఈ చేతనకే బౌద్ధంలో కర్మ అని వ్యవహారం. కర్మఫలం కూడా మనస్సులోనే. బాహ్యంలో కాదు. సుఖం, దుఃఖం అనే వేదనలే కర్మఫలాలు. బాహ్యవస్తువులు కాదు. కర్మను, కర్మఫలాన్ని రెంటినీ మనస్సులోనే చూపడం హర్షించదగిన లేదా గమనించదగిన అంశంగా కనిపిస్తున్నది.

సర్వ సత్త్వహితం (welfare of all living beings), బుద్ధత్వం అటుంచి సామాన్య ప్రజల దైనందిన జీవితానికి (day to day life) ఈ పుస్తకం ఉపకరిస్తుందా? అనే ప్రశ్నకు సమాధానం బౌద్ధం తెలియని రామయ్య భీమయ్యల నిర్వాకమే. ఈ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువులో (A Universe which comprises, 1000 million (నూరుకోట్లు) Suns, 1000 million Moons, 1000 millions Heaven and Hells etc) ఎక్కడో ఒక మూలన విసిరివేయ బడినట్లుగా ఉన్న సహాలోక ధాతువులో (name of our world system) ఉన్నట్టి భూగోళం అనబడే ఒక చిన్న గోళంలో అమ్మోరుకట్ట అనే కుగ్రామంలో రామయ్య భీమయ్య అనే ఇద్దరు రైతులున్నారు. శ్రమజీవులే. ఎవడి కష్టం వాడు పడుతూ పండిస్తున్నారు. ఐరావతం లాంటి

(white elephant) ప్రభుత్వ యంత్రాంగాన్ని మోస్తున్నారు. కానీ వాళ్ళిద్దరికీ బౌద్ధం తెలియనందువల్ల అనవసరంగా ఒకరిమీద ఒకరు అయిష్టాన్ని ద్వేషాన్ని స్పర్ధను అసూయను ఈర్ష్యను పెంచుకొని స్వీయ చిత్తాలను బాగా కలుషితం చేసుకొన్నారు. ఒకనాడు వాళ్ళిద్దరి మధ్య పొలం గట్టుమీద ఉన్న ఐదు తాటిచెట్ల విషయంగా గొడవ జరిగింది. ఐదూ తనవే అన్నాడు రామయ్య. "కాదు ఆ మూడే నీవి. ఈ రెండు నావి" అన్నాడు భీమయ్య. ఆ గొడవ క్రమంగా తిట్టుకోవడం కొట్టుకోవడం దాక వెళ్ళింది. ఆపైన ఐదారేండ్లు కోర్టు చుట్టూ తిరిగి చెరి ఏభైవేలు ఖర్చు చేసుకొన్నారు. చివరకు అలసిపోయి ప్రక్క ఊరి సోమయ్య చూపిన రాజీసూత్రానికి అంగీకరించారు. వివాదాస్పదంగా మారిన ఆ రెండు తాటిచెట్లను సోమయ్య చెరి ఒకటి తీసుకోమని రాజీసూత్రం ప్రతిపాదించాడు. సోమయ్య కొంచెం బౌద్ధం తెలిసినవాడిలాగున్నాడు !



# బోధిచిత్తానుశంస

*(Praise of the Awakening mind)*

భవరోగి అయిన నాకు వైద్యుడు బుద్ధుడు. ఆయన ఉపదేశాలు (ధర్మం), నాకు ఔషధం. ఆయన చూపిన మార్గంలో నడిచేవాళ్ళు (సంఘం) నాకు ఉపస్థాయకులు (nursing persons). ఈ త్రిరత్నములకు (బుద్ధుడు, ధర్మం, సంఘం) ఆదరంగా (respectfully) నమస్కరించి బోధిచర్యావతారాన్ని (guide to Bodhisattva's way of life) చెబుతాను. స్వకపోలకల్పితంగా ఏమీ చెప్పను. గృధ్రకూటంలో (Vulture peak), జేతవనంలో ఆమ్రవనంలో వేణువనంలో ఇంకా ఇతర ప్రదేశాల్లో బుద్ధభగవానుడు మహాకరుణతో శిష్యులకు బోధించిన సూత్ర వాక్యాల సందేశాన్ని సంక్షిప్తం చేసి చెబుతాను. చెప్పే విషయం కొత్తది కాకపోయినా వినేవాళ్ళకు ఆసక్తికరంగా చెప్పబోతున్నావా అంటే అంతటి సంగ్రథన కౌశలం (శబ్దాల కూర్పులో నేర్పు) నాకు లేదు. వినేవాళ్ళను ఉద్ధరిస్తున్నాననే భావన బొత్తిగా లేదు. మంచి భావాలతో నా మనస్సును గుబాళింపజేసుకోవడం కోసం నాకు నేనే ఉపన్యాసం ఇచ్చుకొంటున్నాను. ఇతరులకు వినబడే రీతిలో ఎందుకు మాట్లాడుతున్నానంటే వినేవాళ్ళలో ఎవరో ఒకరు నాలాంటివాడుంటే (of same temparament) అతనికి నా మాటలు ఉపయోగపడవచ్చు అనే ఉద్దేశంతో మాట్లాడుతున్నాను.

యుగయుగాలకు పూర్వం సుమేధుడనే యువకుడు దీపంకరతథాగతుని ముందు ప్రతిజ్ఞ చేశాడు : "ఎక్కడ చూసినా దుఃఖమే తాండవిస్తుంది. త్రివిధ దుఃఖాలలో (1. దుఃఖదుఃఖం, 2. విపరిణామదుఃఖం, 3. సంస్కారదుఃఖం)

జీవరాశి కొట్టుమిట్టాడుతున్నది. ఈ సమస్త జీవరాశి సముద్ధరణం కోసం నేను ఉద్యమిస్తాను. నా సుఖం, నా ముక్తి, నా ఉన్నతి అనేవి చాలా అల్పమైన ఆశయాలు. సర్వసత్త్వహితమే నా లక్ష్యం. కనుక బుద్ధత్వం కోసం ఉద్యమిస్తాను." ఆ ప్రణిధితో (aspiration) ఆ సంకల్పంతో (intention) మొదలైన సుమేధుని మహాప్రస్థానం (great onward march) అసంఖ్యేయకల్పాల ఉద్యమంగా కొనసాగి చివరగా గయాక్షేత్రంలో బోధివృక్షం క్రింద ధర్మకాయంగా పరిణమించింది.

అంధకార బంధురంగా ఉన్న నా జీవితానికి ఆ బోధిచిత్తమే సూర్యోదయ మయ్యింది. వ్యర్థచింతనలతో నికృష్టమైన ఆశయాలతో అధోగతిముఖంగా పయనిస్తున్న నన్ను అగాధంలో పడిపోనీయకుండా కాపాడిన మాత బోధిచిత్తం. నాకిక భయం లేదు. గతంలో చేసిన పాపాలన్నీ బోధిచిత్త స్వీకారంతో దగ్ధమైపోతాయి. ఈ సంసార సాగరం నాకిక గోష్పదంతో సమానం. బోధిచిత్తానికి పోలిక చెప్పాలంటే హాటక ప్రభాసమే (gold making elixer). దాని స్పర్శ సోకగానే హీనలోహం బంగారం అయిపోతుంది. అలాగే పృథక్ జనుడుగా (worldling) ఉన్న నేను బోధిచిత్త స్పర్శ సోకిన క్షణంలో జినసుతుడను (spiritual son of Buddha) అయిపోతాను. వశిరాజమహామణికి మించిన శ్రేష్ఠవస్తువు లోకంలో లేదు. అలాగే బోధిచిత్తానికి మించిన ఉన్నతాశయం మరొకటి లేదు. బోధిచిత్తానికి మించిన పుణ్యరత్నం వేరొకటి లేదు. గంగానది ఇసుక రేణువులు ఎన్ని ఉన్నాయో అన్ని స్తూపాలు చైత్యాలు మందిరాలు విగ్రహాలు నిర్మించి పూజలు చేస్తే లభించే పుణ్యంకన్నా కోటిరెట్ల పుణ్యం కేవలం బోధిచిత్త స్వీకారంతోనే లభిస్తుంది. ఆర్యవీరదత్త పరిపృచ్ఛా సూత్రంలో భగవానుడు చెప్పనే చెప్పాడు :

**బోధిచిత్తాద్ధి యత్పుణ్యం తచ్చ రూపి భవేద్యది**
**ఆకాశధాతుం సంపూర్య భూయశ్చోత్తరం తద్భవేత్**

బోధిచిత్తం వల్ల కలిగే పుణ్యానికి రూపం (form) ఏర్పడే పక్షంలో దాన్ని

ఇముడ్చుకోవడానికి ఈ ఆకాశధాతువు (infinite space) చాలదు.

బోధిచిత్తాన్ని కలిగినట్టి మహాత్ములందరికీ నా నమస్కారములు.

**తేషాం శరీరాణి నమస్కరోమి**
**యత్రోదితం తద్వరచిత్తరత్నమ్**
**యత్రాపకారో ఽపి సుఖానుబంధీ**
**సుఖాకారాంస్తాన్ శరణం ప్రయామి**

సర్వశ్రేష్ఠమైన బోధిచిత్తరత్నాన్ని కలిగినట్టి బోధిసత్త్వులకు నమస్కరిస్తున్నాను. బిడ్డ తన్నితే తల్లికి కోపం రాని విధంగా అపకారం చేసినవారి పట్ల కూడా మైత్రీభావం (loving kindness) కలిగిన బోధిసత్త్వులను శరణు పొందుచున్నాను.



# పాపదేశన

*(Confession of Sins)*

పరిచయ వాక్యాలు

బౌద్ధంలో భక్తిభావన (devotion) మొదట్నుంచీ ఉన్నదే. "భక్తి" అనే పదం తొట్టతొలుతగా బౌద్ధ గ్రంధంలోనే (థేరగాధ) కనిపిస్తున్నదని హరదయాళ్ అనే గొప్ప పరిశోధకుడు తెలిపాడు. భక్తి, శరణాగతి, ప్రార్థన, పూజ, శ్రద్ధ అనేవి చాలా అవసరమైన హృదయగుణాలు. ఉన్మత్తత (insanity) నుండి మనిషిని కాపాడే శక్తి వీటికి ఉన్నది.

భక్తి శ్రద్ధల ప్రభావాన్ని తెలిపే కథ ఒకటి జ్ఞాపకానికి వస్తున్నది. ఆ కథ వాస్తవమా అవాస్తవమా విచారం అక్కర్లేదు. చైనాదేశం లోని ఒక ఊరి నుండి కొందరు వర్తకులు భారతదేశానికి ప్రయాణమయ్యారు ఆ ఊరిలో ఒక ముసలావిడ ఆ వర్తకులతో "నాయనలారా, బుద్ధుని జన్మభూమికి వెళ్తున్నారు. మీరెంతో అదృష్టవంతులు. నేనొక అభాగ్యురాలిని. ఆ అదృష్టం నాకు లేదు. మిమ్మల్ని మరీమరీ ప్రార్థిస్తున్నాను. ఆ దేశం నుండి తిరిగి వచ్చేటప్పుడు మరచిపోకుండా నా కోసం బుద్ధుని అవశేషం (relic) ఒకటి తీసుకరావాలి. నా పూజా మందిరంలో ఉంచి పూజించుకొంటాను" అని ప్రాధేయపడింది. "ఇదొక పిచ్చిది. బుద్ధుని అవశేషాలు భారతదేశం బజారుల్లో లభించే కొనుగోలు వస్తువు అనుకొంటూ ఉంది" అని మనస్సులో అనుకొని పైకి "అలాగే అవ్వా, తప్పక పట్టుకొస్తాము" అన్నారు వర్తకులు.

మూడేండ్ల తరువాత ఆ వర్తకులు తిరిగి స్వస్థలం చేరుకొన్నారు. ఊరి పొలిమేరకు వచ్చాక ఒక వర్తకుడికి ఆ ముసలావిడ విన్నపం జ్ఞాపకం వచ్చింది. అతని ఇల్లు ఆమె ఇంటి ప్రక్కనే. వట్టి చేతుల్తో వెళ్ళి ఆ ముసలావిడ తిట్టే తిట్లు తినడం ఎందుకని భావించి అటూ ఇటు చూశాడు. దారికి ప్రక్కగా చచ్చిపడియున్న శునకం కనిపించింది. దాని పంటిని ఒకటి ఊడబెరికి బాగా కడిగి ఒక బరిణలో పెట్టి ఆ అవ్వకిచ్చాడు. ఆమె ఆనందానికి అవధుల్లేవు

కొన్నాళ్ళకు ఆ అవ్వ ఇల్లు ఒక యాత్రాస్థలం అయిపోయింది. బహుదూర ప్రాంతాలనుండి కూడా భక్తులు వస్తున్నారు. అక్కడ వరసలో నిలబడి ఆ దంతాన్ని దర్శనం చేసి పూజించి వెళ్తున్నారు. ఈ భక్తుల వెల్లువను చూసి ఆ వర్తకుడు "మూఢజనులు" అని మొదట ఉపేక్షించి ఊరుకొన్నాడు.

"దంతం ఒకవిధమైన కాంతితో ధగధగ మెరుస్తున్నది" అని చూసివచ్చినవాళ్ళు చెబుతుంటే ఉండబట్టలేక తనూ వరుసలో నిలబడి చూసివచ్చాడు అతని మనస్సు గందరగోళం అయింది. పాపభీతి పట్టుకొనింది. ఆ దంతం తను ఇచ్చిందే. కానీ అప్పుడు లేని కాంతి ఇప్పుడది వెదజల్లుతూ ఉంది. బుద్ధుని దంతం పేరిట శునకదంతానికి పూజలు జరుగడం అతనికి మహాపచారంగా తోచింది ఇక ఉపేక్షించి ఊరుకోరాదని నిశ్చయించాడు. అతను బాహ్యుడు (outsider) కాదు. త్రిరత్న శరణు పొందిన ఉపాసకుడు. కనుక ఆ అపచారాన్ని ఆపాలని నిశ్చయించి అసలు విషయం బయటపెట్టాడు. కానీ ఏం లాభం ? అసలు విషయం బయటపడినా ఆ దంతం కాంతి అలానే ఉంది. మాయమైపోలేదు ఆ అవ్వ యొక్క భక్తి శ్రద్ధల ప్రభావం వల్ల ఆ దంతానికి కూడా ప్రభావం సంక్రమించి దివ్యమైన చైత్యంగా (divine object of worship) మారిపోయింది!

శాంతిదేవునికి ఇష్టదైవాలయొక్క దివ్యరూపాలను మనస్సులో సాక్షాత్కరించుకొనగలిగిన భావనాబలం (visualisation) ఉన్నది కనుక తనను

తన ఇష్టదైవాల ముందరున్నట్లే భావించి అనుత్తర పూజ (supreme worship) చేస్తాడు.

1. వందనం (obeisance)

2. పూజ (worship = ధూపం, దీపం నైవేద్యం వగైరా షోడశోపచార పూజ)

3. శరణగమనం (going for refuge)

4. పాపదేశన (confession of sins / faults)

5. అనుమోదనం (rejoicng in good works of others)

6. అధ్యేషణ (prayer / invitation to the Buddha to expound the law)

7. యాచన (supplication / request / begging Buddha not to abandon living beings)

8. పరిణామన (transfer of merit)

Note :- "పాపదేశన" అతిగా చేసినందువల్లనేమో పాశ్చాత్యదేశాల్లో బోధిచర్యావతారం చాలా popular అయ్యింది ! పాపదేశన అనేది క్రైస్తవంలోనూ ఉన్నది.

ప్రకృతి సావద్యం (violations against nature killing, hurting, robbing, stealing deceiving etc), ప్రజ్ఞప్తి సావద్యం (violations against conventions: sex, food habits, indulgence in pleasures etc) అనే రెండు దోషాల్లో నా ఉద్దేశంలో ప్రజ్ఞప్తి సావద్యాల పట్ల పాపదేశన అక్కర్లేదు. ప్రకృతి సావద్యాలకే పాపదేశన అవసరం అవుతుంది.

# పాపదేశన

*(Confession of Sins / Faults)*

బోధిచిత్త రత్నాన్ని నేను స్వీకరిస్తున్న ఈ శుభసమయంలో ఓ తథాగతులారా, నా పూజను స్వీకరించండి. లోకంలోని పుష్పాలను, ఫలాలను, పుణ్యజలాలను ఇంకా ఇతర పూజాద్రవ్యాలను మానసికంగా మీ పాదపద్మాలకు సమర్పిస్తున్నాను. మహాకృపాత్ములారా, నేనొక అపుణ్యాత్ముడను, మహాదరిద్రుడను. మీ పూజకోసం ఇవ్వదగినదేదీ సొంతంగా నావద్ద లేదు. లోకనాథులారా, నా మీద కరుణతో నా ఈ మానసిక పూజను స్వీకరించి నన్ను అనుగ్రహించండి నేను మీకు సమర్పించగలిగినది ఒకటే ఒకటి నా అధీనంలో ఉన్నది. అది ఈ దేహమే. ఓ కరుణా సముద్రులారా, నన్ను మీ దాసానుదాసుడుగా భక్తితో సమర్పించుకొంటున్నాను. ఈ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువులో ఎన్ని అణువులున్నాయో అన్ని సాష్టాంగ నమస్కారములు మీకు చేస్తున్నాను. గతంలో నేను చేసిన తప్పిదాలను మీ ముందు బహిర్గతం (confess) చేస్తున్నాను. దశదిశల్లో ఉన్నట్టి బోధిసత్త్వులారా, చేతులు జోడించి మీకు నమస్కరిస్తున్నాను. నా అత్యయదేశనాన్ని (confession of sins), ఏమీ దాచిపెట్టకుండా మీముందు ప్రకటపరుస్తున్నాను. మీ ఉపదేశాల విలువను గ్రహించలేకపోయినందువల్ల నా గత జీవితం గాఢాంధకారంగా గడిచిపోయింది. మరణం అనేది ఒకటి అవశ్యం ఉందనే సత్యాన్ని గుర్తించనందువల్ల నా గత జీవితంలో అనేక తప్పిదాలు జరిగిపోయాయి. ఇష్టులు, అనిష్టులు; మిత్రులు, శత్రువులు; స్వకీయులు, పరకీయులు-ఇలా విభాగం చేసుకొని లెక్కలేనన్ని అకృత్యాలు చేశాను. చేయించాను. ఇతరులు చేస్తుంటే చూసి ఆనందించాను. ఇపుడు పశ్చాత్తాపంతో తపించిపోతూ మిమ్మల్ని ఆశ్రయిస్తున్నాను.

**ప్రియాప్రియనిమిత్తేన పాపం కృతమనేకధా**
**సర్వముస్సృజ్య గంతవ్యమితి న జ్ఞాతమీదృశమ్**

ఎప్పుడో ఒకప్పుడు అన్నిటికీ మంగళం పాడేసి (full stop పెట్టేసి) ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవలసినవాడిననే తెలివి లేకపోవడం వల్ల చాలా అనర్థం జరిగిపోయింది. అనవసరంగా జీవితాన్ని స్పర్ధలు వైషమ్యాలతో పంతాలు పట్టింపులతో పగప్రతీకారాలతో సాధింపులు వేధింపులతో అలజడిపాలు చేసుకొన్నాను. ఇప్పుడు వెనక్కి తిరిగిచూసుకొంటే అంతా ఒక కలలాగా అనిపిస్తున్నది. గతకాల అనుభూతులన్నీ (past experiences) ఇప్పుడు కేవలం స్మృతులుగా మిగిలిపోయాయి. ఆయా దశల్లో నా మనస్సును పూర్తిగా ఆక్రమించుకొన్న ఆయా వ్యక్తులు ఇష్టులైతేనేమి అనిష్టులైతేనేమి చాలామంది ఇప్పుడసలు ఈ లోకంలోనే లేరు. మరికొందరు ఇప్పుడు ఎక్కడ ఎలా బ్రతుకులీడుస్తున్నారో కూడా తెలియదు. ఒకరిద్దరు ఎక్కడనా ఎప్పుడైనా, అనుకోని విధంగా ఎదురవుతారు. కానీ నా పట్ల వాళ్ళ మాటలో తీరులో చూపులో ఒక అపరిచిత వ్యక్తిని చూసేవిధమైన ఉదాసీనత, ముభావం కనిపిస్తుంది. కానీ నేను ఆయా దశల్లో వీళ్ళ సంబంధంగా నా మనస్సును ఎంత అల్లకల్లోలం చేసుకొన్నాను ! మరణ చింతన లేకపోయినందువల్ల కలిగిన అనర్థమిది. ఈ అనిత్య జీవితంలో ఎవరు ప్రియులు ? ఎవరు అప్రియులు ?

**అప్రియా న భవిష్యంతి ప్రియో మే న భవిష్యతి**
**అహం చ న భవిష్యామి సర్వం చ న భవిష్యతి**

ఈ ఆయుష్షు అనే సంపదకు దినదినం వ్యయమే గానీ ఆదాయం లేదు. చావకుండా ఎల్లకాలం ఇక్కడే ఉండబోతున్నానా ?

**రాత్రిందివమవిశ్రామమాయుషో వర్ధతే వ్యయ :**
**ఆయస్య చాగమో నాస్తి న మరిష్యామి కిం న్వహమ్**

మరణ సమయంలో త్రాణంగా (protection) వెంట నిలిచే పుణ్యసంపదను ఆర్జించకుండానే వృథాగా జీవితాన్ని నెట్టివేశాను. జగన్నాథులారా, ఇది తలచుకొంటే నాకు చాలా భయంగా ఉన్నది. మిమ్మల్ని శరణుగోరుతున్నాను. మీ ఉపదేశాలను ఇకమీదట ఉల్లంఘించనని మాట ఇస్తున్నాను. నా తప్పులను క్షమించి నన్ను ఆదుకోండి. ఓ సమంతభద్రా, మంజుఘోషా, అవలోకితేశ్వరా, ఆకాశగర్భా క్షితిగర్భా, వజ్రపాణీ, నా ఆర్తరవములు మీకు వినిపిస్తూనే ఉన్నాయి. పశ్చాత్తాపతప్తుడనై మీ శరణుగోరి అర్థిస్తున్నాను. మీ కరుణాకటాక్షములను నాపై ప్రసరింపజేసి నన్ను అనుగ్రహించండి. మీ అనుగ్రహబలం వల్లనే నేను ఈ సంసారపంకం నుండి బైటపడగలను. నేను ఏకాకిని, అసహాయుడను ఏ క్షణంలో ఈ జీవలోకాన్ని వదలి తెలియని లోకాలకు ఒంటరి ప్రయాణం చేయవలసివస్తుందో తెలియదు. నన్ను కరుణించండి. చేతులు జోడించి మరీమరీ ప్రార్థిస్తున్నాను దయాసముద్రులారా, మీరే నాకు రక్ష. నా భయాందోళనలను శీఘ్రంగా పోగొట్టండి. మీ ఆశ్రయ బలం పొందిన నేనిక నిర్భయంగా ఉంటాను.



# బోధిచిత్త పరిగ్రహం

*(Full Acceptance of Bodhichitta)*

పరిచయ వాక్యాలు

ఒకనాడు కోసలరాజు ప్రసేనజిత్తు బుద్ధుణ్ణి, భిక్షు సంఘాన్ని తన భవనానికి భిక్షకై ఆహ్వానించి ఘనంగా అతిధిసత్కారం చేశాడు. ఆ కార్యక్రమం చివర బుద్ధుడు అనుమోదనం చెబుతూ "ఈ అతిధిసత్కార పూజాఫలం రాజభవన ద్వారానికి ఎదురుగా ఉన్న నాలుగుకాళ్ళ మండపంలో విశ్రాంతి తీసుకొంటున్న పొరుగూరి కృషీవలునికి (farmer) చెందుగాక" అన్నాడు. బుద్ధుని ఆ పుణ్యఫల ప్రకటన ప్రసేనజిత్తు అహంకారాన్ని ఒక దెబ్బ కొట్టింది. "భగవాన్, శ్రమ పడింది నేను, ఖర్చు పెట్టింది నేను. నాకు కదా చెందాలి పుణ్యఫలం. ఆ మండపంలో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చొన్నవానికి పోనడమేమిటి?" అని ప్రశ్నించాడు. "మహారాజా, నీవు శ్రమపడినావు. ధనవ్యయం చేశావు. మా మీద గౌరవ భావం కన్నా నీ మనస్సులో నీ కీర్తి ప్రతిష్ఠలు పేరు ప్రఖ్యాతుల చింతనే ఎక్కువ చోటు చేసుకొన్నాయి. సుదత్తుణ్ణి విశాఖను ఆమ్రపాలిని బింబిసారుణ్ణి మించిపోయాడని నలుగురు నిన్ను గురించి అనుకోవాలని లోలోన భావించావు నీ సత్కార్యం వెనుక చిత్తశుద్ధి లోపించింది. ఆ కృషీవలుడు ఏమీ చేయకపోయినా నీ పుణ్యక్రియ పట్ల నిండు మనస్సుతో అనుమోదనం (rejoicing) వ్యక్తం చేశాడు. నీ పుణ్యక్రియ పట్ల అతను మనస్సులో ఎక్కువ హర్షించాడు, రోమహర్షానికి (పులకింతకు) లోనయ్యాడు. ఆనందబాష్పాలు కార్చాడు. కనుక అతనే నీకన్నా ఈ పుణ్యఫలానికి అర్హుడని నాకు తోచి అలా ప్రకటించాను" అన్నాడు బుద్ధుడు.

ఇక పరిణామనం (transfer of merit) గురించి రెండు మాటలు. స్వార్థబుద్ధి అనేక రకాలు. అందులో ఒక రకం spiritual selfishness. దీనికి విరుగుడుగా పరిణామనం పని చేస్తుంది. పరిణామనం సాధ్యమేనా అనే సంశయం అనవసరం. spiritual selfishness అనే రోగాన్ని పోగొట్టే ఔషధంగా పరిణామనం పని చేస్తుంది.

*Note :- "రెంటికి చెడ్డ రేవడి" అని తెలుగులో ఒక చక్కని సామెత. అధ్యాత్మ సాధకుల్లో full timers గమనించవలసిన సామెత. అధ్యాత్మ సాధకులు ఏ ఆశ్రమంలోనైనా చేరనీ, ఏ సిద్ధాంతాన్నైనా స్వీకరించనీ, ఏ సాధన ప్రక్రియనైనా చేపట్టనీ తప్పు లేదు. కానీ self-centred motives తోనే జీవితం సాగించారంటే చివరకు కృపణులుగా (pitiable) తనువులు చాలిస్తారు.*



# బోధిచిత్త పరిగ్రహం

*(Full Acceptance of Bodhichitta)*

భోగభాగ్యాలతో సుఖంగా హాయిగా క్షేమంగా జీవించగలుగుతున్నవాళ్ళను తలచుకొంటే నాకు ప్రమోదంగా ఉన్నది. ఆ సుఖానికి కారణమైన వాళ్ళ పుణ్యసంపత్తి పట్ల కూడా నాకు అనుమోదంగా ఉన్నది. స్వీయముక్తిని లక్ష్యంగా పెట్టుకొని పనిచేస్తున్న శ్రావకులను ప్రత్యేకబుద్ధులను అనుమోదిస్తున్నాను. జగత్‌హితం కోసం ఉద్యమిస్తున్న బోధిసత్త్వులను అనుమోదిస్తున్నాను.

దశదిశల్లోని బుద్ధులారా, మీకు చేతులెత్తి నమస్కరించి వేడుకొంటున్నాను. ఈ లోకం అంధకారలో పడిపోరాదు. ధర్మదీపాన్ని వెలిగించండి. అది ఆరిపోనీయకుండా చూడండి.

జినులారా (victors), మిమ్మల్ని యాచిస్తున్నాను. నిర్వాణం చెందకండి. అనంత కల్పాలు మీరు నిలిచియుండి ఈ జగత్తుకు వెలుగునిస్తూ ఉండాలి.

నా పూజ వలన, పాపదేశనం వలన పుణ్యానుమోదనం వలన నాకు ఇప్పుడు సంక్రమించిన పుణ్యం సర్వసత్త్వహితం కోసం పరిణమించుగాక! వ్యాధిపీడితులకు ఔషధం అగుదును గాక! వైద్యుడను, ఉపస్థాయకుడను (nursing person) అగుదును గాక! ఆకలిదప్పికలచే అలమటించు జీవులకు అన్నపానీయములగుదును గాక! లేమి వలన బాధపడుచున్న పేద ప్రజలకు అక్షయనిధిని అగుదును గాక! దిక్కులేని దీనజనులకు రక్షకుడనగుదును గాక! దారి తప్పిన జనులను గమ్యానికి చేర్పించువాడినగుదును గాక! సంసారనదిని దాటదలచినవారికి నేను నావను, సేతువును (bridge) అగుదును గాక! ప్రజలకు

కల్పవృక్షం, కామధేనువు, చింతామణి, భద్రఘటం, సిద్ధవిద్య, మహోషధి అగుదును గాక (ప్రజలు కోరినవాటిని తక్షణమే ఇవ్వగల శక్తిమంతుడనగుదును గాక)

**సర్వత్యాగశ్చ నిర్వాణం★ నిర్వాణార్థి చ మే మనః**
**త్యక్తవ్యం చేన్మయా సర్వం వరం సత్త్వేషు దీయతామ్**

నిర్వాణానికి మరో పేరు సర్వత్యాగం. నా మనస్సు నిర్వాణాన్ని కాంక్షిస్తున్నది. అన్నీ వదలి వేయవలసి ఉంది కనుక నా పుణ్యాన్ని సత్త్వహితం (welfare of all living beings) కోసం సమర్పించడం (dedicate చేయడం) మంచిది కదా!

బోధిసత్త్వులు నడిచిన మార్గంలోనే నేనూ పయనిస్తాను. ఆ మహాత్ములు బోధిచిత్త స్వీకారం చేసి ఎలా ఉద్యమించారో ఆ ప్రకారమే నేనూ ఉద్యమిస్తాను. బోధిచిత్తాన్ని స్వీకరించిన నా జన్మ ధన్యమయ్యింది. సుదుర్లభమైన మానవజన్మకు న్యాయం చేయగలిగాను. ఈ క్షణం నుండి నేను జినసుతుడను (spiritual son of Buddha). ఇక నా కులం బుద్ధకులం. ఈ నిర్మలమైన బుద్ధకులానికి కళంకం తెచ్చే పని ఏదీ చేయను. నా పురాకృత సుకృతం వల్ల లభించిన రత్నమిది (బోధిచిత్తం). మృత్యువును నాశనం చేసే రసాయనమిది. దారిద్ర్యాన్ని నిర్మూలించే నిధి ఇది. వ్యాధిని శమింపజేసే దివ్యౌషధమిది. సాంసారిక మరుభూమిలో (desert) పయనించి అలసిన జనులకిది విశ్రామ మహావృక్షం. దుర్గతిని (bad migrations) దాటిపోదలచినవారికిది సామాన్యసేతువు (universal bridge). క్లేశ

---

★ *"నిర్వాణం" అనే పదం అనుభవానికి (experience) సంబంధించిన పదం. కనుక ఆ పదానికి అర్థం అనుభవించినవాడికే తెలియాలి పాళీ త్రిపిటకాల నుండి నిర్వాణాన్ని తెలిపే పదాలు కొన్ని Positive words for Nirvana*

*అంతం (end), సత్యం (Truth), ధ్రువం (stable), శాంతం (peace), శివం (happiness), క్షేమం (security), శుద్ధి (purity), ముక్తి (release), ద్వీప (island), లీన (cave)*

→

ఉపశమనానికి ఉదయించిన చల్లని చంద్రుడిది. అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేసే సూర్యబింబమిది. సద్ధర్మక్షీరాన్ని మథించగా ఉద్భవించిన నవనీతమిది (వెన్న). జగజ్జనులారా, మిమ్ములనందరినీ సాదరంగా ఆహ్వానిస్తున్నాను. రండి, త్వరపడండి. బుద్ధత్వం కోసం ఉద్యమించండి. ఆ ఉద్యమంలో మీకు సుఖమూ లభిస్తుంది సుగతత్వమూ లభిస్తుంది.

---

Negetive words for Nirvana

Social world

అసంబాధ (uncrowded), అస్ఖలిత (undisturbed), నిరుపతాప (untroubled), అభయ (free from fear)

Personal and Conditions

అజాత (freedom from birth), అభూత (freedom from becoming), అకృత (freedom from creation), అసంఘాత (freedom from compounding), అవ్యాధి (without illness), అనీతిక (health), అనాలయ (freedom), అజర (freedom from old age), అమర (deathless)

Ethical

అసంక్లిష్ట (without impurities), అసపత్న (without hostility), అవ్యాపాద (harmless)

Psychological

అనాస్రవ (without obsessions), నిష్ప్రపంచ (freedom from diffuseness, free from illusions), అశోక (free from mental anguish), అభయ (free from fear), విరాగ (without desire)



# బోధిచిత్త అప్రమాదం

*(Vigilance, Non-laxity Regarding Bodhichitta)*

పరిచయ వాక్యాలు

బుద్ధుని చిట్టచివరి మాట : Behold O disciples, I exhort you. Subject to change are all component things Strive on with diligence

ఉపోద్ఘాతంలో ఇంకేమీ చెప్పకుండా మహాదేవ భూపతి కథను చెబుతాను. అతను రాజు కనుక సుఖోపకరణాలు (resources for enjoyments) మెండు. అవి అతనికి బంధకాలుగా (binding) తోచి ప్రతిపక్షభావనగా వాటిని (objects of pleasures = కామగుణాలు) తిట్టిపోసి వైరాగ్యాన్ని పెంచుకొని అడవికి పోయాడు. మనం భోగాల్లో మునిగితేలడం లేదు కనుక మహాదేవభూపతి సమస్య మనకు లేదు. కానీ మనకూ ఏవో కొన్ని అభినివేశాలు (clingings) ఉండనే ఉన్నాయి. ఆత్మ పరిశీలన చేసుకొని వాటిని గుర్తించి తొలగించుకొనే ప్రయత్నాలు చేయడం మంచిది.

మధ్యవయస్కుడైన మహాదేవభూపతి ఒకనాడు అద్దం ముందు నిలబడి ప్రతిబింబాన్ని చూసుకొంటుండగా తలవెంట్రుకల్లో ఒక వెంట్రుక నెరసి ఉండడం గమనించాడు. "ఈ దూత (messenger) ఎప్పుడు వచ్చాడు? నేనిప్పుడే గమనిస్తున్నాను" అనుకొని దానిని తక్కిన వెంట్రుకలనుండి వేరు చేసి ఊడబెరికి అపురూపమైన వస్తువులాగా భద్రంగా చేతిలో ఉంచుకొని ఏకాంతమందిరానికి వెళ్ళి

---

★ దశ అవస్థల్లో ఐదు గర్భావస్థలు కలల, అర్బుద, పేశీ, ఘన, ప్రశాఖ ఐదు జాతావస్థలు : బాల, కుమార, యువ, మధ్య, వృద్ధ.

కూర్చొని చింతన చేశాడు : "మానవుని దశ అవస్థల్లో★ చివరి అవస్థలోకి ప్రవేశిస్తున్నాను. మునివృత్తిని (hermit life) చేపట్టే సమయం ఆసన్నమయ్యింది. కానీ ఈ మనస్సు సిద్ధపడడం లేదు. కామగుణాలను (objects of pleasure) ఇంకా ఇంకా కావాలంటూనే ఉన్నది. ధిక్ ధిక్ (ఛీ ఛీ) ఏమిటీ బాల లక్షణం (మూర్ఖ లక్షణం) ఈ వయస్సులోనూ వదలనంటున్నది! ప్రతిపక్షభావన చేసుకొని వైరాగ్యం కలిగించుకొంటాను.

ఇహ తే బాలా హన్యంతే ఆఘాతన ఇవ వధ్యాః

these pleasures in them fools are slain, as those, who are condemned to death (are killed) in a slaughter - house★

ఇహ తే బాలా రజ్యంతే చిత్రఘటేష్విపామేధ్యపరిపూర్ణేష్వవిద్వాంసః

these pleasures-ignorant fools take delight in them, as they may like beautifully painted vases, which are filled with filth

ఇహ తే బాలా మజ్జంతి గజా ఇవ వారిమధ్యే

these pleasures-in them fools are drowned, like elephants in the water (of rivers, pools etc)

ఇహ తే బాలా రుధ్యంతే చౌరా ఇవ చారకమధ్యే

these pleasures-in them fools are imprisoned, like thieves in jails

ఇహ తే బాలా అభిరతా వరాహా ఇవాశుచిమధ్యే

these pleasures-in them fools find joy, as swine (wallow) in filth.

ఇహ తే బాలా అధ్యవసితాః కుక్కురా ఇవాస్థికరంకమధ్యే

these pleasures-fools cleave to them, like dogs to a heap of bones

---

★ఇంగ్లీషు వాక్యాలు హర్‌దయాళ్‌గారివి *(Bodhisatva Docrine in Buddhist Sanskrit Literature)*

ఇహ తే బాలాః ప్రపతితా దీపశిఖాస్వివ పతంగాః

these pleasures-fools fall into them, like months in to the flame of a amp

ఇహ తే బాలా బధ్యంతే కపయ ఇవ లేపేన

these pleasures-fools are caught with them, like monkeys with smearing ointment

ఇహ తే బాలాః పరిదహ్యంతే జాలోత్క్షిప్తా ఇవ జలజాః

these pleasures-in them fools are destroyed, like the fish caught up in a net

ఇహ తే బాలా పరిక్రూడ్యంతే సూనకాష్ఠేష్వివోరభ్రాః

these pleasures-in them fools are cut to pieces, like rams on the wooden floor of a slaughter-house

ఇహ తే బాలా అవసజ్జంతే కిల్బిషకారిణ ఇవ శూలాగ్రే

these pleasures-on them fools are impaled, like malefactors on the point of a pike (or stake)

ఇహ తే బాలాః సంసీదంతి జీర్ణగజా ఇవ పంకే

these pleasures-in them fools perish, like old elephants in a bog

ఇహ తే బాలా విపద్యంతే భిన్నయానపాత్ర ఇవ మహాసముద్రే

these pleasures-in them fools are wrecked, like ship wrecked persons on the wide seas

ఇహ తే బాలాః ప్రపతంతే మహాప్రపాత ఇవ జాత్యంధాః

these pleasures-into them fools fall, as the blind fall over a high precipice

ఇహ తే బాలాః పర్యాదానం గచ్ఛంతి పాతాళసంధిగతమివ వారి

thee pleasures-in them fools come to their end, like water that has gone in to the chasm leading to the nether world

ఇహ తే బాలా ధూమాయంతే కల్పసంక్షయ ఇవ మహాపృధివీ

these pleasures-in them fools are choked with smoke, like the great earth during the disolution of the universe at the close of the aeon

ఆభిర్బాలా భ్రామ్యంతే కుంభకారకచక్రమివావిద్ధమ్

these pleasures-by these fools are kept in a whirl, like the potter's pierced wheel

ఇహ తే బాలాః పరిభ్రమంతి శైలాంతర్గతా ఇవ జాత్యంధాః

these pleasures-in them fools go astray and wander about, like blind persons in the interior of a mountain

ఇహ తే బాలాః విపరివర్తంతే కుర్కురా ఇవ శర్దూలబద్ధాః

these pleasures-by them fools are made to turn round and round, like dogs in a leash

ఇహ తే బాలా మ్లాయంతే గ్రీష్మకాల ఇవ తృణవనస్పతయః

these pleasures-through them fools wilt and wither, like grass and the trees in the hot season

ఇహ తే బాలాః పరిహీయంతే శశీవ కృష్ణపక్షే

these pleasures-in them fools wane (in strength), like the moon in the dark fortnight

ఆభిర్బాలా భక్ష్యంతే గరుడేనైవ పన్నగాః

these pleasures-by them fools are devoured, as the serpents (are devoured) by Garuda

ఆభిర్బాలా గ్రస్యంతే మహామకరేణైవ పోతః

these pleasures-by them fools are swallowed up, as a boat (is swallowed up) by a huge leviathan (sea-monster)

ఆభిర్బాలా భిద్యంతే మారుతేనేవ శాలాః

these pleasures-by these fools are broken, as trees (are broken) by the wind

ఆభిర్బాలా హన్యంతే దృష్టివిషైరివ జంతవః

these pleasures-by them fools are slain, as the living creatures (are slain) by snakes which have the poison in their very looks

ఆస్వాదసంజ్ఞినో బాలాః క్షణ్యంతే మధుదిగ్ధాభిరివ క్షురధారాభిర్బాలజాతీయాః

these pleasures-fools, who regard them as agreeable and delicious, are wounded by them, as by the edge of a razor blade, besmeared with honey

ఆభిర్బాలా ఉహ్యంతే దారుస్కంధా ఇవ జలౌఘైః

these pleasures-by them fools are carried away, like logs of wood by a flood of water

ఆభిర్బాలాః క్రీడంతి దారకా ఇవ స్వమూత్రపురీషైః

these pleasures-with them fools play, like children with their own urine and excrements

ఆభిర్బాలా ఆవర్త్యంతే అంకుశేనేవ గజాః

these pleasures-by them fools are made to turn round, like elephants with the driver's goad (or hook)

ఆభిర్బాలా బధ్యంతే దూర్తకైరివ బాలజాతీయాః

these pleasures-by them fools are cheated, as simple-minded folk (are cheated) by rogues

ఇహ తే బాలాః కుశలమూలాని క్షపయంతి ద్యూతాభిరతా ఇవ ధనమ్

these pleasures-in them fools throw away their roots of merit, as gamblers (throw away) their wealth.

ఆభిర్బాలా భక్ష్యంతే రాక్షసీభిరివ వణిజాః

these pleasures-by them fools are devoured, as travelling merchants (are devoured) by the female ogress

33 ప్రకారములుగా మహాదేవభూపతి కామగుణాలను (objects of pleasure) నిందించి దూషించి ఖండించి ఈ నిశ్చయానికి వచ్చాడు : "కామరాగాన్ని కామచ్ఛందాన్ని కామస్నేహాన్ని కామప్రేమను కామేచ్ఛను కామమూర్ఛను కామగృద్ధిని కామపరిగర్ధిని కామనందిని కామనియంతిని కామాధ్యవసానాన్ని★ త్యజించి ముక్తిమార్గంలోకి అడుగువేస్తాను." మహాదేవభూపతి అలా చింతన చేసి పరమ వైరాగ్యాన్ని కలిగించుకొని రాజ్యాన్ని వదలి వనవాసాన్ని ఆశ్రయించాడు.

★ ఈ పదకొండు పదాలు పర్యాయపదాలే



# బోధిచిత్త అప్రమాదం

*(Vigilance, Non-laxity regarding Bodhichitta)*

"సర్వసత్త్వహితం (welfare of all living beings), బుద్ధత్వం వల్లనే సాధ్యం. కనుక నేను బుద్ధత్వం కోసం ఉద్యమిస్తాను" - ఈ దీక్షకే బోధిచిత్తమని పేరు. బోధిచిత్తదీక్ష తీసుకొన్నవాని ప్రధమ కర్తవ్యం ఆ దీక్షకు పొసగనట్టి పనులు చేయకుండా జాగ్రత్త పడడం. కుశల కర్మపథంలోనే (wholesome ways of acting) నడుచుకోవడం. కుశల కర్మపథంలో నడిస్తేనే ప్రజల మీద ఎంతో కొంత ప్రభావం చూపగలుగుతాడు. వాళ్ళను కూడా ధర్మపథానికి ఆకర్షించగలుగుతాడు. ప్రజలను ధర్మపథానికి ఆకర్షించాలంటే చతుస్సంగ్రహ వస్తువులు (four means of conversion) అవసరం. 1. దానం (giving), 2. ప్రియవాదిత్వం (kind words), 3. అర్థచర్య (helpfulness) 4. సమానార్థత (consistency between words and deeds). కుశల కర్మపథంలో నడవనివాడు చతుస్సంగ్రహ వస్తువులను కలిగియుండలేడు. అకుశల కర్మపథం పట్టిక చూపడం ద్వారా కుశల కర్మపథం పట్టిక తెలుస్తుంది కనుక క్రింది పట్టికను గమనించండి.

**మానసిక అకుశల కర్మపథం :**

1. అభిధ్య (covetousness)=ఇతరులకు చెందినదాన్ని బలప్రయోగం ద్వారా గానీ ఉపాయంద్వారా గానీ లాక్కోదలచే చిత్త విశేషం.

2. వ్యాపాద (ill-will)=సత్త్వ విద్వేషం

3. మిధ్యాదృష్టి (false views)=పై రెంటిని కని పెంచి పోషించే చిత్తవిశేషం. దీన్ని గురించి వ్రాయాలంటే పెద్దగ్రంథం అవసరం.

**వాచిక అకుశల కర్మపథం :**

1. మృషావాదం (lying), 2. పైశున్యం (slandering), 3. పారుష్యం (harsh speech), 4. సంభిన్న ప్రలాపం (foolish babble). పైశున్యం అంటే ఇద్దరి మధ్య చిచ్చు పెట్టే మాటలు. వ్యక్తులను అపకీర్తిపాలు చేసేవి కూడా పైశున్యమే. పారుష్యం అంటే గట్టిగా అరవడం అని కాదు. ఎత్తిపొడుపు మాటలు, దెప్పిపొడుపు మాటలు, వ్యంగ్యమైన మాటలు. ఎదుటివాణ్ణి గాయపరచడమే వీటి లక్ష్యం-పైకి అలా అనిపించదు. కానీ ఆ మాటలు పడినవానికే తెలుస్తుంది ఆ బాధ. సంభిన్న ప్రలాపం కథ కూడా పెద్దదే. Unconnected, illogical, irrelevent, self-contradictory speeches కూడా సంభిన్న ప్రలాపమే. ఒక ఆధ్యాత్మప్రసంగం నుండి ఉదా : "మన గురుదేవుని ఆవిర్భావంతో ఒక గొప్ప అధ్యాత్మ ప్రభావానికి లోనుగాని ప్రదేశం ఈ ఇలాతలంలో ఏదీ లేదు..." ఇలా ఓ పది నిమిషాలు గురువు ప్రభావాన్ని పొగిడి పొగిడి వెంటనే "ఎక్కడ జూసినా ఈ దేశంలో స్వార్థము, అవినీతి, అనాచారం, అత్యాచారం, లంచగొండితనం, చేతగానితనము (inefficiency) తాండవిస్తున్నది." సంభిన్న ప్రలాపానికి* ఇంతకన్నా మంచి ఉదాహరణ దొరకదు.

**శారీరక అకుశల పథం :**

1. ప్రాణాతిపాతం (killing), 2. అదత్తాదానం (stealing, robbing), 3. కామ మిథ్యాచారం (sexual misconduct).

బోధిచిత్తానికి విఘాతం కలిగించేవి ముఖ్యంగా క్లేశాలు (afflictions) కనుక శాంతిదేవుడు ఈ అధ్యాయంలో వాటి మీద యుద్ధం ప్రకటించాడు. క్లేశాల గురించి విచారం చాలా పెద్దదయిపోతుంది. కనుక ఇప్పుడు వద్దు. వీటన్నిటికీ ప్రతిపక్షంగా మైత్రి (loving kindness), కరుణ (compassion) ఉంటే చాలు.

* సంభిన్న ప్రలాపం మీదనే లోకక్షేమగాథలు పుస్తకంలో సప్తవర్గీయ భిక్షువుల కథ

ఉపోద్ఘాతం ఇప్పటికే చాలా ఎక్కువయిపోయింది. శ్రమభీరుత, దుఃఖభీరుత అనేవి ప్రమాదానికి (negligence) దారితీస్తాయి. శాంతిదేవుడు ఈ విషయంలోనూ జాగ్రత్త పడడం కోసం తన్ను తాను క్రింది విధంగా హెచ్చరిక చేసుకొన్నాడు :

***స్వజీవికామాత్రనిబద్ధచిత్తాః కైవర్తచండాలకృషీవలాద్యాః***
***శీతాతపాదివ్యసనం సహంతే జగద్ధితార్థం న కథం సహే ఽహమ్***

స్వీయ జీవిక (one's own livelihood) వరకు మాత్రమే మనస్సును లగ్నం చేసిన కైవర్తులు (fishermen), చండాలురు (hunters), కృషీవలురు (farmers) ఇంకా ఇతర వృత్తులవారు చలిబాధను, ఎండబాధను ఇంకా ఇతర బాధలను సహిస్తూ పని చేస్తున్నారు. జగత్తుకంతా హితం చేయాలనే లక్ష్యం పెట్టుకొన్న నేను కష్టాలను ఓర్చుకోకుండా ఎలా ఉండగలను?

ఈ అధ్యాయం ఇక ఇక్కడికి ముగించవచ్చు. కానీ శిక్షాసముచ్చయం రుచి కొంచం చూపించడం కోసం 'వాక్కు' విషయమై శాంతిదేవుడు అక్కడ చెప్పినదాన్ని చూపించి ముగిస్తాను.

"నా మాటల విషయంలో బహుజాగరూకత వహిస్తాను అవలీన వచనములు (నిరుత్సాహకరమైన నీరసమైన మాటలు = despondent words) పలుకను. వ్యవకీర్ణ వచనములు (disconnected = అసంబద్ధ వచనములు) పలుకను. అవస్యంద వచనములు (misrepresenting) పలుకను. ఉజ్వాల వచనములు (inflammatory) పలుకను. రాగానునీత వచనములు (provocative of passions) పలుకను. ప్రాకృత వచనములు (vulgar) పలుకను. న ముఖసాక్ష్యవరోపణ వచనములు (Nothing to discredit any eye-witness) పలుకును. అసంరక్షిత వచనములు (unrestrained) పలుకను. వ్యాపాద సంధుక్ష వచనములు (exciting malice, ill will) పలుకను. చంచల వచనములు చపల వచనములు (very loose talk) పలుకను. నటరంగ వచనములు (fiction) పలుకను. క్షుణ్ణవ్యాకరణ

వచనములు (confused in details) పలుకను. స్వపక్ష ఉత్కర్షవచనములు (partial to one's own side) పలుకను. పరపక్ష నిగ్రహవచనములు (unfair to the other side) పలుకను. ఆభిమానిక వచనములు (show of self-conceit) పలుకను.

నా మాటలు స్నిగ్ధంగా (friendly), మృదువుగా (gentle), మనోజ్ఞంగా (pleasant), మధురంగా (sweet), ప్రియకరణిగా (agreeable), కర్ణసుఖంగా (pleasing to the ear), హృదయంగమముగా (reaching the heart), ప్రేమణిగా (affectionate), వర్ణవిస్పష్టంగా (clear to the ear), విజ్ఞేయంగా (clear to the understanding) ఉండేవిధంగా జాగ్రత్త పడుతాను.

Note :- ఏదీ వదలకుండా అంతా చెప్పి పరితలను గజిబిజి చేయడం కన్నా జీవితానికి *relevent*గా ఉండే విషయాలను మాత్రం *highlight* చేయడం మంచిదనిపిస్తుంది. ఈ రెండు పేరాల విషయం మనం ఒంట బట్టించుకొంటే చాలు. ఇంటా బయట *90* శాతం ఘర్షణలు, అశాంతి తగ్గిపోతాయి.

అప్రమాదం = *zeal, non-laxity, earnestness, diligence is considered as the foundation of all progress*

*Just as all the footprints of living beings are surpassed by the footprint of the elephant is considered as the mightiest amongst them, just so have all the meritorious qualities zeal as their foundation, and zeal is considered as the mightiest of these qualities*

- ఏకోత్తర ఆగమం

# సంప్రజన్య రక్షణం

*(Guarding Awareness)*

పరిచయ వాక్యాలు

మహిళాముఖుడనే భిక్షువు వేణువన విహారం నుండి వ్యాహ్యాళిగా గంగానది ఒడ్డుకు బయలుదేరాడు. ఆ నదీ తీరంలోని మఱ్ఱివృక్షం క్రింద ఒక తీర్థికుడు ప్రసంగిస్తున్నాడు. మహిళాముఖుడు ఆ ప్రసంగాన్ని వినడానికోసం ఆగాడు. "భక్తులారా, మీరు మీ ఇంద్రియ ద్వారాల వద్ద కాపలావాళ్ళను (గూర్ఖాలను) సదా నిలిపియుంచవలెను. విషయములు లోనికి వస్తున్నప్పుడు వాటిని లోనికి రానీయకుండా బయటకు తరిమికొట్టవలెను". మహిళాముఖుడిక వినదలచుకోలేదు. "ఈ అంధవచనములు వినడానికీ ఇక్కడ వందమంది గుమికూడారు కదా!" అనుకొంటూ ముందుకు కదిలాడు.

"కాపలావాళ్ళను పెట్టడం ఏమిటి? తరిమి కొట్టడం ఏమిటి? పరమాద్భుతమైన శరీరనిర్మాణం, వివిధ అవయవాల పనితీరు తెలియని మూర్ఖులు! పదివేల రుచి భేదాలను తెలుసుకొంటున్న నా జిహ్వేంద్రియ కౌశలం తలచుకొంటేనే ఆశ్చర్యంగా ఉన్నది. అలాగే తక్కినవీ పరమాద్భుతములే! ఇవి లేకపోతే నా బ్రతుకేమిగాను! మట్టిముద్దలా పడియుండవలసినవాణ్ణే కదా..." ఇలా చింతన చేస్తూ మహిళాముఖుడు వేణువన విహార ద్వారం చేరగానే అక్కడ సాగరమేఘ భిక్షువు ఎదురుపడి "ఎక్కడికి వెళ్ళి వస్తున్నావు?" అని ప్రశ్నించాడు. "పుణ్యభాగీరథీ నదీ తీర సుందర దృశ్యాలను చూసి ఆనందించి వస్తున్నాను" అన్నాడు మహిళాముఖుడు. "నీ ఇంద్రియాలను మరీ ఎక్కువ గాయం చేసుకోవద్దు"

అన్నాడు నర్మగర్భంగా సాగరమేఘుడు. "నా ఇంద్రియాలకు అసలు గాయం తగిలే ప్రసక్తే లేదు. స్మృతి సంప్రజన్యములను (mindfulness and awareness) కవచంగా కలిగియున్నాను. స్మృతి సంప్రజన్యములు లేనివాళ్ళకే గాయాలు. నేనిక్కడకు రాకముందు కొంతకాలం ప్రయాగలోని తీర్థకాశ్రమంలో అంతేవాసిగా (disciple) ఉన్నాను. మొదట కూరగాయలు తరిగే పనిలో పెట్టారు. ఆ పనిలో నాకు తోడుగా మరొక అంతేవాసిని కూడా నియమించారు. అతను నాకు సహాయపడిందేమీ లేదు. కూర్చున్న కాసేపటికి వేలికి గాయం చేసుకొని ఆ గాయం మీద 'ఉఫ్ ఉఫ్' అని ఊదుకొంటూ లేచి వెళ్ళిపోయేవాడు. ఇలా రెండు మూడు సార్లు జరిగాక "పనిలో ఏకాగ్రత లేదు నీకు" అన్నాను. "ఏకాగ్రత ఎందుకు లేదు? గురువుగారు చెప్పినట్లే చేస్తున్నాను. 'ఏ పని చేస్తున్నా ఒక ప్రక్క భగవన్నామాన్ని స్మరిస్తూ ఉండుము' అని మా గురువు ఉపదేశించాడు. ఆ ప్రకారమే నేను కూరగాయలు తరుగుతున్నప్పుడు కూడా నామస్మరణ ఒక ప్రక్క చేస్తూనే ఉన్నాను. మరి ఇలా ఎందుకవుతున్నదో తెలియడం లేదు" అన్నాడు ఆ అంతేవాసి. చేస్తున్న పని మీద పూర్తిగా మనస్సు పెట్టి చేయనందువల్లనే అతడు గాయాలు చేసుకొన్నాడు. స్మృతి సంప్రజన్యములు తెలిసినవాడైతే గాయాలయి ఉండవు" అన్నాడు మహిళాముఖుడు.

ముందు ఈ రెండు పదాల పట్ల ఒక మాదిరి అవగాహన అవసరం కనుక ఒక ఉదాహరణ ద్వారా అర్థాన్ని తెలుసుకొందాము. కాలిబాటలో నడుస్తున్నాను. ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాను. అసంకల్పితంగా (unconsciously) నా చేయిని ప్రక్కకు సాచి చేతికి అందిన ఆకులను దూయడమో లేదా ఏదో పుల్లను విరిచేయడమో చేస్తాను. నేనేమి చేస్తున్నానో నా మనస్సు గమనిస్తూ ఉంటే awareness కలిగియుంటే) అక్కడ అంటే ఆ చర్యలో కాస్త విరామం (gap) ఏర్పడియుండేది. ఆ విరామక్షణమే స్మృతి తలెత్తేందుకు ఉపకరించే క్షణం. స్మృతి ఏమి తెలుపుతుందంటే "నిష్ప్రయోజనమైన పని చేయడం చపలత్వం" అని తెలుపుతుంది.

నడుస్తున్నప్పుడు నడుస్తున్నానని, కూర్చున్నప్పుడు కూర్చున్నానని - ఇలా ప్రతి పనిని ఎప్పటికప్పుడు ఒక ప్రక్క గమనిస్తూ ఉండడాన్ని సంప్రజన్యం★ (full awareness) అంటారు. పనులు మూడు రకాలు. కాయిక వాచిక మానసికములు. మాట్లాడేటప్పుడు ఏమి మాట్లాడుచున్నాను, ఎలా మాట్లాడుచున్నాను గమనిక కలిగియుండడమూ, ఆలోచనలు (thoughts and feelings) ఎలా ఎలా కదులుతున్నాయి గమనిక కలిగియుండడమూ సంప్రజన్యం (awareness) అవుతుంది. సంప్రజన్యం అలవడితే ఎన్నో అనర్థాలనుండి విముక్తులవుతాము. ఏదైనా పనిలో మనస్సు పూర్తిగా లగ్నం అయినప్పుడు (obsorb అయినపుడు) ఈ సంప్రజన్యం వీలుపడదు కదా అంటే ఆ స్థితిలో ఈ సంప్రజన్యంతో పని లేదు కదా! విక్షేపాలనుండి (distractions) మనస్సును మళ్ళించి వర్తమానంలోనే (present లోనే) దాన్ని ఉంచడానికే సంప్రజన్యం అవసరం. విక్షేపరహితంగా మనస్సు పని మీద ఉంటే ఇక సంప్రజన్యంతో పనేముంది? సంప్రజన్యం బాగా అలవడినవానికి

---

★ చరంశ్చరామీతి ప్రజానాతి స్దితః స్దితో ౨ స్మీతి ప్రజానాతి నిషణ్ణో నిషణ్ణోస్మీతి ప్రజానాతి శయానః శయితో ౨స్మీతి ప్రజానాతి యధా యధాస్య కాయః స్దితో భవతి తధా తధైనం ప్రజానాతి పేయాలం (పేయాలం అంటే *so on, etc* అనే అర్థంలో) సో ౨తిక్రామన్ వా ప్రతిక్రామన్ వా సంప్రజానచారీ భవతి ఆలోకితే విలోకితే సమింజితే ప్రసారితే సంఘాటీపట పాత్ర చీవరధారణే అశితే పీతే ఖాదితే నిద్రాక్లమ ప్రతి వినోదనే ఆగతే గతే స్దితే నిషణ్ణే సుప్తే జాగరితే భాషితే తూష్ణీంభావే ప్రతిసంలయనే సంప్రజానచారీ భవతీతి

- ప్రజ్ఞా పారమిత

*When walking, he knows 'Iam walking', when standing he knows 'I am standing', when sitting he knows 'I am sitting', when lying down he knows 'I am lying down', in what ever position his body is he knows that position of the body*

*In walking to and fro, he practices clear comprehension, in looking ahead and in looking elsewhere, he practices clear comprehension, in bending and stretching (his limbs), he practices clear comprehension, in wearing the inner and outer robes and in carrying the bowl, he practices clear comprehension, in eating, drinking, chewing he practices clear comprehension, in sleeping or in coming, going, standing, sitting he practices clear comprehension or in waking, in speech or in silence or in obsorption he practices awareness.*

జీవితం ప్రతిక్షణమూ ధ్యానమే అయిపోతుంది.

మనస్సుకు స్మరించే శక్తి ఉన్నది. ఈ స్మరణశక్తిని (memory) నిరుపయోగమైన విషయాలకు (అవాస్తవాలకు, కల్పనలకు) వెచ్చించకుండా సద్వినియోగం చేసుకొనే విధానాన్ని బౌద్ధులు స్మృతి (mindfulness) అంటారు. నడవడికను శాసించే ఉపదేశ వాక్యాలకు శిక్ష (disciplinary code) అని పేరు. ఈ శిక్షా వాక్యాలను జ్ఞప్తిలో పెట్టుకొని ఆయా సమయ సందర్భాల్లో జ్ఞాపకానికి తెచ్చుకొంటూ నడవడికను సరిచేసుకొనేందుకు వినియోగంలోకి తీసుకరావడం ఒక విధమైన స్మృతి (mindfulness). ఈ అధ్యాయంలో శాంతిదేవుడు ఈ విధమైన స్మృతినే ప్రధానంగా చెప్పాడు. కొంతవరకు కాయగతానుస్మృతిని (contemplation of body) వివరించాడు. బౌద్ధంలో ధ్యానప్రక్రియగా నాలుగు స్మృత్యుపస్థాపనములు (four bases/foundations of mindfulness) చెప్పబడినాయి. 1. కాయగతానుస్మృతి, 2. వేదనానుస్మృతి, 3. చిత్తానుస్మృతి, 4. ధర్మానుస్మృతి. ఈ పేర్లను చూసి జడుసుకోవలసిన అవసరం లేదు. ధ్యానం అనేది బౌద్ధంలో వాస్తవాల మీదనే (facts, reals, actualities) అనే విషయం తెలుస్తున్నది. బౌద్ధధ్యానాన్ని క్రమ పద్ధతిలో అభ్యసింపదలచినవారు ఉచితంగా పదిరోజుల శిక్షణ తరగతి నిర్వహించే కేంద్రాన్ని సంప్రదించగలరు. అడ్రసు : Vipassan International Meditation Centre, Dharmakhet, Nagarjuna Sagar road, Kusum Nagar, Hyderabad - 500 070 ఈ పుస్తకం అనుబంధంలో ఆనాపానసతిని గురించి ఒక వ్యాసం చేర్చాను గమనించగలరు.

# సంప్రజన్య రక్షణం

*(Guarding of Awareness)*

**భూమిం ఛాదయితుం సర్వాం కుతశ్చర్మ భవిష్యతి**
**ఉపానచ్చర్మమాత్రేణ ఛన్నా భవతి మేదినీ**

ఈ భూమి నడవడానికి సుఖంగా లేదు. రాళ్ళు రప్పలు గాయపరుస్తాయి. ఏమి చేయాలి? మొత్తం భూమిని మెత్తని చర్మంతో (leather) కప్పగలమా? అసాధ్యం, కానీ ఉపాయం ఉన్నది. ఒక జత చెప్పులు కాలికి తొడుక్కుంటే మొత్తం భూమిని చర్మంతో కప్పివేసినట్లే !

**బాహ్యా భావా మయా తద్వచ్ఛక్యా వారయితుం న హి**
**స్వచిత్తం వారయిష్యామి కిం మమాన్యైర్నివారితైః**

బాహ్యాజగత్తును (external events) నాకు అనుకూలంగా త్రిప్పుకోవడం అసాధ్యమైన పని. కానీ సుఖంగా శాంతంగా జీవించడానికి ఉపాయం ఉన్నది. స్మృతి సంప్రజన్యములనే జత చెప్పులను మనస్సుకు తొడుక్కోవడమే.

**చిత్తం రక్షితుకామానాం మయైష క్రియతే అంజలిః**
**స్మృతిం చ సంప్రజన్యం చ సర్వయత్నేన రక్షత**

చిత్తాన్ని రక్షించుకోదలచిన సోదరులారా, మీకు చేతులెత్తి నమస్కరించి ప్రార్థిస్తున్నాను. స్మృతిని సంప్రజన్యాన్ని సర్వయత్నంతో కాపాడుకొనండి.

ఓటికుండలో వెయ్యి బిందెల నీళ్ళు తెచ్చి పోసినా లాభం ఏమున్నది? ఓటికుండ ఓటికుండే. అది నిండదు. స్మృతి సంప్రజన్యం లేని చిత్తం ఓటికుండతో

సమానం. దిండ్లు లాంటి గ్రంథాలు వేయి చదివినా ప్రయోజనం లేదు.

సందు దొరికితే చిత్తమందిరంలోకి దూరి పుణ్యధనాన్ని కొల్లగొట్టడానికి క్లేశ తస్కరులు (రాగద్వేషాదులు) కాచుకొని యుంటారు. చిత్తమందిరాన్ని కాపాడుతూ స్మృతి సంప్రజన్యములుంటే అవి లోనికి దూరలేవు.

"నన్నెవరూ చూడడం లేదు" అనే మిధ్యాభావనతో శిక్షను (discipline) అతిక్రమించను. బుద్ధులు, బోధిసత్త్వులు నన్ను చూస్తూనే ఉన్నారు. వాళ్ళు నా ముందర ఉన్నట్లే సదా భావిస్తూ ఉంటాను. దీని వలన నాకు రెండు లాభాలు 1. శిక్షాపాలన (maintaining discipline) 2. బుద్ధానుస్మృతి (contemplating Buddha)

**నిష్ఫలా నేత్రవిక్షేపా న కర్తవ్యాః కదాచన**
**నిధ్యాయంతీవ సతతం కార్యా దృష్టిరధోగతా**

నేత్రములను వృధాగా పనిలో పెట్టరాదు. (నేత్రము పరమాద్భుతమైన ఇంద్రియం అనడంలో సంశయం అక్కరలేదు. మనిషి శక్తిలో 80 శాతం, నేత్రాల ద్వారానే ఖర్చవుతుందని ఒకరి అంచనా. అది నిజమో కాదో మనకు తెలియదు. నిరుపయోగ నేత్రవిక్షేపాన్ని అరికట్టడం ఎంతో మంచిది. బస్సుల్లో పోతున్నప్పుడు షాపుల పేర్లు, వాల్‌పోస్టర్లు, హోర్డింగులు-ఇంకా ఏది కనబడితే అది చదువుతూ పోవడం ఎందుకు? ఏమిటి ప్రయోజనం? నేత్రశక్తి వృధా కావడం లేదా?)

**సశబ్దపాతం సహసా న పీఠాదీన్ వినిక్షిపేత్**
**నాస్ఫాలయేత్కపాటం చ స్యాన్నిశ్శబ్దరుచిః సదా**

పీటలు గిన్నెలు మొదలగు వస్తువులను పెద్ద చప్పుడు కలిగేలా విసిరివేయరాదు. తలుపులను వేసేటప్పుడు తీసేటప్పుడు పెద్ద శబ్దాన్ని పుట్టించరాదు. ఎల్లప్పుడూ నిశ్శబ్దరుచిగా ఉండవలెను.

(అధ్యాత్మికత ఉందా లేదా అనే దానికి గుర్తు నిశ్శబ్దరుచి ఉందా లేదా చూడడమే. గట్టిగా పగలబడి నవ్వడం, పెద్దగా అరచి మాట్లాడడం వగైరా లక్షణాలు అధ్యాత్మికత అనిపించుకోదు. శబ్దకాలుష్యం (noise pollution) యొక్క అపకారాన్ని ప్రజలు గుర్తించడం లేదు. గుర్తిస్తే దేశంలో ఎక్కడా మైకులసలే ఉండవు.)

**ఋజు పశ్యేత్సదా సత్త్వాంశ్చక్షుషా సంపిబన్నివ**
**ఏతానేవ సమాశ్రిత్య బుద్ధత్వం మే భవిష్యతి**

దప్పిక వేసినవాడు చల్లని నీళ్ళను ఆప్యాయంగా త్రాగే విధంగా సత్త్వులను (living beings) ప్రీతిగా సూటిగా చూడవలెను. ఎందుకంటే వీరిని ఆశ్రయించు కొనియే నేను బుద్ధత్వాన్ని సాధించవలసియున్నది కనుక.

(బౌద్ధం anthropomorphic/ego-centric కాదు. సర్వసత్త్వహితాన్ని కోరుతుంది. సర్వసత్త్వహితాన్ని లక్ష్యంగా చెబుతుంది. ego-centric భావాలదే ఇప్పటివరకు పైచేయి. ఈ దౌర్భాగ్యపు భావాలు మానవునిలో స్వార్థాన్ని స్వీయనాశనం అంచుల వరకు నెట్టాయి. మేధావులు ఈ అపాయాన్ని గుర్తించారు. పర్యావరణ సంరక్షణ విషయమై దిగులు చెందుచున్నారు. ఈ భూమి కేవలం మానవుడిదే కాదు. సమస్త జీవరాశిది. కనుక పశుపక్ష్యాదులను కూడా ప్రేమగా దయగా చూడడం సంస్కారలక్షణం (cultured attitude). అడవులు చెట్లు చేమలు తగ్గిపోతూ, వాటిని ఆశ్రయించుకొని బ్రతికే జీవరాశి నాశనం అవుతూ వస్తే చివరకు మానవుడు కూడా ఈ భూమి నుండి "get out" కి గురికాక తప్పదు.)

**దంతకాష్ఠస్య ఖేటస్య విసర్జనమపావృతమ్**
**నేష్టం జలే స్థలే భోగ్యే మూత్రాదేశ్చాపి గర్హితమ్**

(civic sence ని ఈ శ్లోకం బోధిస్తుంది. పల్లుపుల్ల, గళ్ళ (phlegm), ఇంకా ఇతర దేహమలినాల విషయమై civic sense ని బోధిస్తున్నది. civic sense విషయం చాలా ఉంది. ఉదా॥ యధేచ్ఛగా బిడ్డలను ఒన్ టూ త్రీ ఫోర్ ఫైవ్ సిక్స్ సెవెన్ అని కని* సమాజంలోకి (already over crowded) తోయడం కూడా lack of civic sense. చైనా ప్రభుత్వాన్ని మెచ్చుకోవాలి. "టూ అంటే దెబ్బ పడుతుంది" అని బెత్తాన్ని ఝళిపించి దేశాన్ని దారికి తెచ్చుకొన్నారు.)

(శాంతిదేవుడు భిక్షువు కనుక ఆ జీవితానికి సంబంధించిన ఇంకా అనేక నియమాలను జ్ఞాపకం చేసుకొన్నాడు. ఎన్ని నియమాలున్నా బోదిసత్త్వుడు prudishగా (చాదస్తంగా) మాత్రం ఉండడు. కరుణకు పెద్ద పీట వేస్తాడు. జ్యోతిర్మాణవకుడు అనే బోధిసత్త్వుడు రాగచరితుడు కాకపోయినప్పటికీ ఒక స్త్రీ కన్నీటిని తుడిచివేసేందుకు వ్రతభంగానికి భయపడలేదు. మరొక బోధిసత్త్వుడు ఐదు మంది ప్రాణాలు కాపాడడం కోసం ఒకణ్ణి చంపివేశాడు. ఏదేని ఒక మంచి లక్ష్యాన్ని (good aim) హృదయానికి మిక్కిలి ఇష్టమైనదాన్ని పెట్టుకొని పనిలోకి దిగితే ఆ పనియే జీవితంలో ఒక నియమాన్ని (order) తీసుకవస్తుంది. కనుక ఎవరి నియమాల్ని వాళ్ళే జీవితంలోకి తెచ్చుకోవడం ఉత్తమం. ఇక ఈ అధ్యాయాన్ని శాంతిదేవుని చివరి రెండు శ్లోకాలతో ముగిస్తాము.)

**ఏతదేవ సమాసేన సంప్రజన్యస్య లక్షణమ్**
**యత్కాయచిత్తావస్థాయాః ప్రత్యవేక్షా ముహుర్ముహుః**

---

★ *కుటుంబ జీవితాన్ని నిరసించే comment కాదు కుటుంబం అనేది దేశానికి basic unit. ఈ యూనిట్స్ బాగుంటేనే దేశం బాగుంటుంది ఎక్కువ పిల్లల్ని కని ఇంటిలో దారిద్ర్యం పెంచుకొంటే దేశమూ దరిద్రంగానే ఉంటుంది. మంది ఎక్కువైతే మజ్జిగ పలచన అన్నట్లు పిల్లలు ఎక్కువైతే ప్రేమ, వాత్సల్యం, పోషణ అంతా పలుచబడిపోతుంది*

సంగ్రహంగా చెప్పాలంటే దేహం యొక్క చిత్తం యొక్క ప్రతి కదలికను గమనిస్తూ ఉండడమే సంప్రజన్య లక్షణము.

**కాయేనైన పఠిష్యామి వాక్యపాఠేన తు కిం భవేత్**

**చికిత్సాపాఠమాత్రేణ రోగిణః కిం భవిష్యతి**

ఉపదేశ వాక్యాలను నోటితో వల్లిస్తూ ఉండడం వల్ల కలిగే ప్రయోజనం ఏమిటి? ఆచరణలో చూపే ప్రయత్నం చేస్తాను. వైద్య గ్రంథాల్లోని చికిత్సా విధానాలను చదువుతూ కూర్చుంటే రోగం నయమవుతుందా?



# క్షాంతి పారమిత

*(Perfection of Forbearance)*

పరిచయ వాక్యాలు

క్షాంతి (forbearance, endurance, patience) అనేది కుశల చిత్త విశేషము. క్రోధానికి (anger), ద్వేషానికి (hatred), ప్రతిఘకు (repugnance), వ్యాపాదానికి (malice, ill-will) ప్రతిపక్షం.

జాతకమాల చదివిన పాఠకులకు అందులో క్షాంతిజాతకమ్, మహిషజాతకమ్ కథలు జ్ఞాపకమే. జాతకమాల కథలు నమ్మశక్యంకాని త్యాగాలతో నిండియున్నాయనే అభిప్రాయం కలుగవచ్చు. ఆచరణకు అసాధ్యములనిపించవచ్చు. ఆ కథల్లో ఒక రహస్యం ఉన్నది. "చిత్తం" అనేది అరూపం (not matter) కనుక కంటికి కనిపించదు బోధిసత్త్వుని "చిత్తం" కూడా అరూపమే కాని ఆ చిత్తం యొక్క మహోన్నత స్థాయిని ఏదో విధంగా శ్రోతల కళ్లకు కట్టినట్లుగా తెలిపే ప్రయత్నమే ఆ కథలు. మాత్సర్య కాలుష్యం (miserliness; stinginess, niggardliness) ఇసుమంత కూడా లేని నిర్మల చిత్తం బోధిసత్త్వునిది అని ఆ అద్భుత దాన కథలు తెలుపుతాయి. అలాగే ఇతర కథలు కూడా బోధిసత్త్వుని యొక్క మహోన్నత చిత్త స్థితిని కళ్ళకు కట్టిస్తాయి. ఈ కథలు తర్కబుద్ధిని (intellect) ఒప్పించే ప్రయత్నం చేయవు. ఏకంగా ఇవి హృదయాన్ని సంబోధిస్తాయి. దేహం పట్ల (existence పట్ల) ఎంత అభినివేశం (clinging) కలిగియున్నామో ఇప్పుడు తెలియడం లేదు దాని కథ మరణ సమయంలో తెలుస్తుంది. జాతకమాలలోని శరీర త్యాగకథలు బోధిసత్త్వుని చిత్తంలో అభినివేశ కాలుష్యం కించిత్ కూడా లేదని తెలుపుతాయి. జీవితంలో

ఎదురయ్యే అనూహ్య క్లిష్ట పరిస్థితులకు బెంబేలు పడకుండా నిబ్బరంగా ఉండగలగడం కూడా క్షాంతిలో అంతర్భాగమే. ఈ ఒప్పుదల, అంగీకారం (acceptance acquiscence, saying yes) జీవితానికి చాలా అవసరం. మనకు ఏమి తక్కువైందని ఏడుపు ? అంత అన్నం తింటున్నాము, నీళ్ళు త్రాగుతున్నాము, వెలుగును చూస్తున్నాము, గాలిని పీలుస్తున్నాము. ఇవి లభిస్తున్నాయి కనుక వీటి విలువ తెలియడం లేదు. (వీటి విలువను చక్కగా గుర్తించిన మహాత్ములు వీటిని అష్టమూర్త్యాత్మకుడైన పరమశివుని రూపాలుగా భావించారు) నంగి ఏడుపుల వాళ్ళు మార్క్‌ట్వెయిన్ వ్రాసిన ఒక యధార్థ కధను జ్ఞాపకం చేసుకోవాలి.

అమెరికాలో ఒక పెద్ద గుహ. దీపమో టార్చిలైటో లేకుండా లోనికి అడుగుపెట్టను వీలుకానంత గాఢాంధకారమైన గుహ. దానికి రెండు ప్రవేశ ద్వారాలు. ఒకటి ముఖద్వారం (front entrace) అనబడేది వెనుక ద్వారం అనబడేది బొత్తిగా జనసంచారం లేని నది ఒడ్డును ఆనుకొనియున్నది. రెండు ద్వారాలకూ ఇనుప తలుపులు తాళం వేసి యుంటాయి. వెనుక తలుపును ఎప్పుడూ తెరవరు. ముఖద్వారం తలుపును మాత్రం ఆదివారం నాడు-అదీ ఎవరైనా పర్యాటకులు, స్కూలు పిల్లల బృందం వచ్చి కోరితేనే తెరచి మళ్ళీ మూసివేసి తాళం వేస్తారు.

ఒక ఆదివారంనాడు స్కూలు పిల్లల బృందం వస్తే ఆ గుహను తెరచారు. ఆ బృందంలో ఇద్దరు సాహసిక బాలురు గుహ యొక్క అంతు చూసిరావాలనుకొని ఇతరుల కంటపడకుండా మెల్లగా బృందం నుండి వేరయి ముందుకు దూసుకెళ్ళారు. వంకరటింకరగా ఉన్న ఆ గుహలో వాళ్ళు టార్చి సహాయంతో వేగంగా అడుగులు వేసుకొంటూ అవతలి ద్వారానికి వచ్చి చేరారు. ఆశ్చర్యం ! ఆ ద్వారం తెరచియున్నది. ఉన్నట్టుండి వాళ్ళు చాలా బెదిరిపోయారు. సన్నని గురక శబ్దం వినిపిస్తున్నది. భయం భయంగా అటూ ఇటూ చూశారు. ఒక మూల కనబడిన దృశ్యాన్ని చూడగానే వాళ్ళకు ప్రాణం పోయినంత పని అయ్యింది ఒక్క క్షణం

కూడా ఆలస్యం చేయకుండా మహావేగంతో గుహనుండి బైటపడి తెరచియున్న ఆ తలుపును మూసి బోల్టు చేసి ఒకే పరుగుతో వెళ్ళి మళ్ళీ బృందంలో కలిసిపోయారు. తాము ఏమి చూశారు ? ఏమి చేశారు ? ఆ పిల్లలు బైటపెట్ట లేదు - టీచరు దండిస్తాడనే భయంతో. రెండు వారాల తరువాత విషయం బయట పెట్టారు. అప్పటికే జరుగవలసిన అనర్థం జరిగిపోయింది !

పోలీసులు తీవ్రంగా గాలిస్తున్న ఒక భయంకరమైన హంతకుడు ఒకడు కొన్నాళ్లుగా సరిగా నిదురపోవడం లేదు. తటాలున పోలీసులు వచ్చి పట్టుకొంటారనే భయంతో అతను సరిగా నిదురపోవడం లేదు. నిశ్చింతంగా నిదురించడం కోసం అతను ఆ గుహ వెనుకతట్టు ద్వారం తాళాన్ని పగులగొట్టి లోనికి వెళ్ళి పడుకొన్నాడు. ఆ ఇద్దరు బాలురు చూసింది అతణ్ణే. ఆ హంతకుడు హాయిగా నిదురించి లేచాక గుహనుండి బైటపడే మార్గం లేక అతను పడిన అవస్థ వర్ణనాతీతం. తినడానికి ఆహారం లేదు. ఏదో ఒకటి లోనికి పడవేయమని survival instinct చేస్తున్న ఒత్తిడికి తట్టుకోలేకపోయాడు. ఆ చీకటి గుహలో తినదగిన వస్తువు ఎంత గాలించినా దొరకదు - గబ్బిలాలు తప్ప. అతడు చేతులను పైకి చాచి ఇటూ అటూ కదిలిస్తూ విశ్వప్రయత్నం చేసి ఒకటి రెండు గబ్బిలాలను పట్టుకొని తిన్నాడు. ద్రవపదార్థం కోసం (liquid =water) నోరు అల్లాడిపోతుంటే ఆ బాధను భరించలేక ముంజేతిని కొరుక్కొని స్వంతరక్తాన్ని నోటిలోనికి జుర్రుకొన్నాడు. ఎన్నాళ్ళు సాగించగలడు ఈ జీవన పోరాటం ? పూర్తిగా అలసిపోయాడు. బయటి ప్రపంచంలోని వెలుగు కోసం ఆరాటపడుతూ ద్వారం వద్ద క్రింద అంచునుండి సన్నగా లోనికి వస్తున్న సూర్య కాంతిని చూస్తూ ప్రాణాలు వదిలాడు.

ఈ అధ్యాయంలో శాంతిదేవుడు మూడు విధాలైన క్షాంతిని ఉపన్యసించాడు. 1 దుఃఖఅధివసనాక్షాంతి (patient endurance of pain and hardship), 2. పరాపకారమర్షణక్షాంతి (patient endurance of wrongs done by others), 3. ధర్మనిధ్యానక్షాంతి (acceptance/acquiescence by having insight into things

and events) 134 శ్లోకాల ఈ సుదీర్ఘ అధ్యాయాన్ని సాకారంగా (concreteగా) చూడదలిస్తే కుణాలుడు సరిపోతాడు.

అశోక చక్రవర్తి పట్టమహిషి పద్మావతీదేవి కుమారుడు ధర్మవివర్ధనుడు అతని నేత్రములకు అసాధారణమైన శోభ (beauty) ఉండడం వల్ల కవుల కావ్యాల్లోని ఉపమానాలు ఏవీ కూడా ఆ నేత్ర రామణీయకతను వర్ణించడానికి సరిపోయేవి కాదు. హిమాలయాల్లో మాత్రమే కనబడే కుణాల పక్షి కన్నుల వంటి సుందరమైన కన్నులు కలిగినవాడని ప్రజలు చెప్పుకోవడంతో అతనికి కుణాలుడు అనే పేరు వాడుకలోకి వచ్చింది.

కుణాలుడు చిన్నప్పటినుండి స్థవిర ఉపగుప్తుని వద్ద అధ్యాత్మ శిక్షణను పొందాడు. జీవితానికి ఎందుకూ పనికిరాని అయోమయ విద్యగా అధ్యాత్మ విద్య మారిపోవడానికి కారణం ఆ విద్యా దోషం కాదు. దానిని ప్రవచించే వక్తల దోషమే. దుఃఖం నుండి విముక్తిని పొందే ఉపాయాలను తెలిపేది అధ్యాత్మ విద్య. శరీరానికి కలిగే ఎలాంటి బాధనైనా (దుఃఖం) తట్టుకొనగలిగే శక్తి నిచ్చే ఒకానొక ధ్యానాన్ని ఉపగుప్తుడు కుణాలునికి నేర్పి బాగా అభ్యసింపజేశాడు. దాని పేరు "సర్వధర్మ సుఖాక్రాంతి సమాధి." మానసికంగా కలిగే బాధలను (శోకం) తట్టుకొనగలిగే ప్రజ్ఞావాక్యాలనూ బోధించి బాగా మననం చేయించాడు. ఉపగుప్తుని శిక్షణ వల్ల కుణాలుడు యౌవన దశకు వచ్చేసరికే మొత్తం జీవితం పట్ల చక్కని అవగాహన కలవాడయ్యాడు. అనాత్మ చింతన, అనిత్య చింతన, దుఃఖసత్య చింతన వల్ల అతని చిత్తం చాలా పరిపక్వత (maturity) చెందింది. ఆ పరిపక్వత వల్ల అతని మాటలో చూపులో నడతలో ఎలాంటి వెకిలితనం కనిపించేది కాదు. అతణ్ణి చూసి ప్రజలు, "మనం బుద్ధుణ్ణి చూడలేదు కానీ బుద్ధుడు ఎలా నడిచేవాడు ఎలా మాట్లాడేవాడు అనే విషయాన్ని కుణాలుణ్ణి చూసి ఊహించుకోవచ్చు" అనుకొనేవారు. కుణాలుణ్ణి చూసినపుడు, తలచినపుడు అశోకచక్రవర్తి ఆనందంతో పరవశించి పోతూ "నా వారసుడు" అనుకొనేవాడు.

విద్యాభ్యాసం పూర్తయ్యాక కుణాలునికి వివాహం అయ్యింది. భార్య పేరు కాంచనమాల. వివాహం అయిన కొంతకాలానికి అశోకుడు అతణ్ణి తక్షశిలకు రాజప్రతినిధిగా నియమించాడు. ప్రయాణానికి ముందు కుణాలుడు అందరి వద్ద సెలవు తీసుకొంటూ పినతల్లి అయిన తిష్యరక్షిత నివాసానికి వెళ్ళాడు. తిష్యరక్షిత ప్రౌఢవయస్కురాలు. పైకి సంప్రదాయాన్ని పాటిస్తూ చైత్యాలకు స్తూపాలకు ప్రదక్షిణలు చేస్తుంది కానీ ఆమె మనస్సు విప్లవభావాల మనస్సు. ఆమెలోని ఒక భావం : "పురుషవాంఛ వల్లనే ఆ వాంఛా సాఫల్యానికి అనుగుణమైన (suitable) స్త్రీ శరీరం జీవికి నిర్మితమయ్యింది. స్త్రీ వాంఛ వల్లనే ఆ వాంఛాసాఫల్యానికి అనుగుణమైన (suitable) పురుష శరీరం జీవికి నిర్మితమయ్యింది. కనుక స్త్రీ పురుష శరీరాలు వాంఛా నిర్మితాలు. వాంఛలలో తప్పు లేదు. తప్పు అని పంచశీల చెప్పేవాళ్ళు, జీవితం అంటే ఏమిటో బొత్తిగా తెలియనివాళ్ళు".

కుణాలుణ్ణి తన మందిరం ఏకాంతంలో చూసిన ఆ క్షణంలో ఆమెలో ఒక వింత కోరిక బలంగా కలిగింది. అంతకు పూర్వం ఎన్నోసార్లు కుణాలుణ్ణి జనం మధ్యలో చూసియున్నది, మాట్లాడియున్నది. అప్పుడు లీలామాత్రంగా కూడా తలెత్తని అనుచితవాంఛ ఇప్పుడు బలంగా బుసలుకొట్టి పడగ ఎత్తింది. కుణాలుడు ఋషితుల్యుడు. తిష్యరక్షిత భగ్నమనోరథ అయింది. ఆమె 'అహం' దెబ్బ తినింది. వాంఛ, ప్రతీకారవాంఛగా రూపాంతరం చెందింది. అతణ్ణి సర్వనాశనం చేయాలని నిశ్చయించుకొనింది.

కొన్నేండ్లు గడిచింది. అశోకచక్రవర్తి అస్వస్థుడై కొన్నాళ్లపాటు అపస్మారక స్థితికి లోనయ్యాడు. ఆ సమయంలో తిష్యరక్షిత రాజముద్రికను తన అధీనంలో ఉంచుకొనింది కుణాలుని మీద పగ సాధించే అవకాశం ఆమెకు అప్పుడు లభించింది. రాజముద్రిక బలంతో కుతంత్రం నడిపింది. ఈ విధ్వంసక కార్యంలో మాత్రం ఆమె భగ్నమనోరథ కాలేదు. కుణాలుడు పదవి కోల్పోయాడు.

కన్నులు పెకలింపబడినవాడయ్యాడు. తక్షశిల నుండి గెంటివేయబడినవాడున్నూ అయ్యాడు.

భార్య కాంచనమాల అతణ్ణి నడిపిస్తూ పాటలిపుత్రానికి ప్రయాణయ్యింది. కొన్ని నెలల పాటు అనేక మజిలీలుగా సాగిన ఆ సుదీర్ఘ ప్రయాణంలో కుణాలుడు తనకు తెలిసిన విద్యతో జీవికను (livelihood) గడిస్తూ ప్రయాణించాడు. వీణను అద్భుతంగా మీటుతూ జనులను ఆ వీణావాదనంతో రంజింపజేస్తూ భిక్షను గడిస్తూ ప్రయాణించాడు. చివరకు భార్యాభర్తలు పాటలిపుత్రం చేరారు. అక్కడెవ్వరూ వీళ్ళను గుర్తుపట్టలేదు. ముష్టివాళ్ళనే భావమే వాళ్ళకు కలిగింది. ఒకనాడు పాటలిపుత్రం రాజమార్గం ప్రక్కన ఉన్న ఒక విశాలవృక్షం క్రింద కూర్చొని కుణాలుడు వీణను మీటుతున్నాడు. ఏదో పనిమీద హడావిడిగా అటు వెళ్తున్న ఆస్థాన సంగీత విద్వాంసుడు ఆ వీణావాదనను విని రక్కున ఆగాడు. "ఆశ్చర్యం ! పరమాశ్చర్యం! ఇంత దివ్యంగా వీణను పలికించగలిగేది ఒక్క కుణాలుడే. ఈ ముష్టివాడికి ఇది ఎలా సాధ్యమయింది ? కుణాలుని వద్ద నేర్చుకొన్నాడా? అసంభవం! ఒకరు నేర్పితే మరొకరు నేర్చుకొనే విద్య కాదది. ఒక్క కుణాలునితోనే వచ్చిన విద్య అది. అతనితోనే అంతరించిపోయేదిన్నూ! కానీ ఈ గుడ్డి బిచ్చగాడు అచ్చం కుణాలునిలా వీణను పలికిస్తున్నాడు! ఏమిటీ వింత! కనుక్కొంటాను" అనుకొని అతని సమీపానికి పోయి "బాబూ, ఈ వీణావాదనను నీకు కుణాలుడు నేర్పాడా?" అని ప్రశ్నించాడు. ఆ కంఠధ్వని ఎవరిదో కుణాలుడు గుర్తించి "ఆచార్యా, అభివాదం. నేనీ విద్యను ఎవరినుండీ నేర్చుకోలేదు. ఎవరికీ నేర్పనూ లేదు. కుణాలుడను నేనే" అన్నాడు.

* * *

అశోకచక్రవర్తి సభాభవనమది. అమాత్యులు, సేనాపతులు ఇంకా అనేక ప్రముఖులు ఆసీనులై యున్నారు. సింహాసనం దిక్కుగా తలెత్తి చూడడానికి

కూడా వాళ్ళలో చాలా మందికి భయం వేస్తున్నది. సింహాసనం మీద వృద్ధ సింహంలా రౌద్రాకారంతో అశోకచక్రవర్తి ఆసీనుడై యున్నాడు. అక్కడ చాలా మందికి అది నమ్మశక్యం కాని కొత్త అనుభవం. వృద్ధ సేనాపతులు కొందరికి మాత్రం ఆ రౌద్రరూపం అనుభవమే - ముప్పై ఏండ్ల క్రిందట కళింగ యుద్ధభూమిలో! కుణాలుడు ఆస్థాన సంగీత విద్వాంసుని దృష్టిలో పడిన తరువాత ఒకటి వెంట ఒకటి వేగంగా అనేక సంఘటనలు జరిగాయి. తిష్యరక్షిత నడిపిన కుతంత్రం వెలుగులోకి వచ్చింది. ఆమెకు శిక్ష విధించడానికి ఏర్పాటైన సభ అది అశోక చక్రవర్తి చండాశోకునిలా మండిపోతున్నాడు. తిష్యరక్షితను చిత్రహింసలు పెట్టి చంపవలసినదిగా ఆజ్ఞ ఇవ్వబోతున్నాడు. "నాన్నా" అనే మధురాతి మధురమైన కంఠస్వరం విని ఆగాడు. ఆ పిలుపు, ప్రక్కనే మరో ఆసనం మీద కూర్చునియున్న కుణాలునిది. లేచి చేతులు జోడించి ఇలా విన్నవించాడు : "మన ఆచార్యదేవుడు స్థవిర ఉపగుప్తుడు నిరుపధిశేష నిర్వాణం* పొంది ఇప్పటికి సరిగ్గా పదేండ్లయ్యింది. అయినప్పటికీ ఆ మహానుభావుని మంగళప్రదమైన రూపం నాకు ఇప్పటికీ కళ్లకు కట్టినట్లు కనిపిస్తూనే ఉంది. నా కర్మగతిని ముందుగానే చూడగలిగిన అభిజ్ఞా సంపన్నుడాయన. కర్మగతిని మార్చడం సాధ్యం కాదని తెలిసిన ఆయన నాకు దాన్ని తట్టుకొని నిలబడగలిగే శిక్షణ ఇచ్చి వెళ్ళాడు. నా శరీరానికి బాధగానీ మనస్సుకు శోకంగానీ హృదయానికి కొరత గానీ ఎవరివల్లా నాకు కలుగలేదు. నేత్రములు లేకపోవడం వల్ల మగధ రాజ్య సింహాసనాసీనతకు అర్హతను కోల్పోయాను కానీ దీన్ని ఒక నష్టంగా నేను భావించడం లేదు. అశోకచక్రవర్తికి పుత్రుడననే భావన కూడా నాకు లేదు ఉపగుప్తులవారి అనుగ్రహం వల్ల నేను ధర్మరాజపుత్రుడనయ్యాను (spiritual son of Buddha) ఆయన కల్యాణమిత్రత్వ భాగ్యం (spiritual guidance) నాకన్నా మీకే ఎక్కువ లభించింది కదా! ఆయన నిర్దేశించిన విధంగా మీరు ఆసేతు హిమాచల పర్యంతం లెక్కలేనన్ని చైత్యాలు,

---

* దేహంలో జీవించియున్నప్పటి నిర్వాణం సోపధిశేషనిర్వాణం దేహం వదిలాక నిరుపధిశేషనిర్వాణం

స్తూపాలు నిర్మించారు. సద్ధర్మ వ్యాప్తికి అహోరాత్రాలు శ్రమించారు. మీరు గడించినంత పుణ్యారాశిని ఇంకే చక్రవర్తీ గడించలేదు. గడించబోరు. ఇంతటి పుణ్యరాశి కూడా ఒక్క క్షణ ద్వేషచిత్తం, క్రోధచిత్తం వల్ల ధగ్ధమైపోగలదని కదా తథాగత వచనము. ముప్పై ఏండ్ల క్రితం మీ జీవితంలో మహత్తరమైన మార్పుకు కారణమైన భదంత ఉపగుప్తుణ్ణి ఒక్కసారి స్మరించండి. తథాగతుని కరుణా రూపాన్ని కూడా ఒక్కసారి స్మరించండి. మీరు దేశంలో అనేకచోట్ల నెలకొల్పిన శిలాశాసనాల్లో తథాగత బోధనలు ఏడింటిని* విశేషించి ప్రశంసించియున్నారు. వాటిని కూడా ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకొనండి మీరు నాకు ఇష్టాన్ని ప్రియాన్ని చేయదలచి అనుగ్రహించే పక్షంలో నా మనవి ఒకటే. నా తల్లి తిష్యరక్షితకు క్షమాభిక్షను అర్థిస్తున్నాను"

చండాశోకుడుగా మారిపోయిన అశోకుడు ఆ క్షాంతిశీలుని హితవచనములకు ప్రభావితుడై మళ్ళీ శాంతాశోకుడుగా ధర్మాశోకుడుగా మారాడు.

---

* 1 వినయసముక్కస (*superior teachings of Vinaya*), 2 ఆర్యవంశాని (*noble lineage*), 3. అనాగత భయాని (*future fears*), 4 మునిగాథ (*verses of sage*), 5 మునిసూత్ర (*practice of silence*), 6 ఉపతిష్యప్రశ్న, 7 రాహుల అపవాద (*exhortation to Rahula*)



# క్షాంతి పారమిత

*(Perfection of Forbearance)*

**న చ ద్వేషసమం పాపం న చ క్షాంతిసమం తపః**
**తస్మాత్ క్షాంతిం ప్రయత్నేన భావయేద్వివిధైర్నయైః**

ద్వేషానికి (hatred, ill-will, malice, intolerance) సరితూగ గలిగే పాపం మరొకటి లేదు. క్షాంతికి సమానమైన తపస్సు మరొకటి లేదు. కనుక వివిధ ఉపాయాల ద్వారా క్షాంతిని అభ్యసించే ప్రయత్నం చేయాలి.

నాకు ఇష్టాలు (desirable), అనిష్టాలు (undesirable) ఉన్నాయి. నా ఇష్టానికి దెబ్బ తగిలినపుడు మనస్సు దౌర్మనస్యానికి (మానసిక సంతాపం = dejection) లోనవుతుంది. అనిష్టం దాపురించినపుడు కూడా మనస్సు దౌర్మనస్యానికి లోనవుతుంది. ఈ దౌర్మనస్యమే ద్వేషానికి ఆహారంగా (nutrition) పని చేస్తుంది. కనుక ద్వేషానికి పుష్టికారణంగా ఉన్నట్టి ఈ దౌర్మనస్యాన్ని తొలగించుకొనే ఉపాయం అవలంబించాలి.

**యద్యస్త్యేవ ప్రతీకారో దౌర్మనస్యేన తత్ర కిమ్**
**అథ నాస్తి ప్రతీకారో దౌర్మనస్యేన తత్ర కిమ్**

బాగా విచారించి చూస్తే దౌర్మనస్యానికి ఆస్కారమే లేదు. కావాలనుకొన్నవి తెచ్చుకొనే ఉపాయాలు, వద్దనుకొన్నవి వదిలించుకొనే ఉపాయాలు ఉంటే ఇక దౌర్మనస్యం ఎందుకు? ఆ ఉపాయాలను అవలంబించవచ్చు కదా! తెచ్చుకొనే ఉపాయాలు వదిలించుకొనే ఉపాయాలు బొత్తిగా లేకుంటేనూ ఇక దౌర్మనస్యం ఎందుకు? (పరిహరించడానికి వీలు కాని విషయాల్లో శోకం ఎందుకు?)

**కథంచిల్లభ్యతే సౌఖ్యం దుఃఖం స్థితమయత్నతః**
**దుఃఖేనైవ చ నిస్సారః చేతస్తస్మాద్ దృఢీ భవ**

సుఖం అనేది ఎంతో ప్రయత్నం వల్లగానీ లభించడం లేదు. దుఃఖమో ప్రయత్నం లేకుండానే వచ్చిపడుతుంది. ఓ మనసా, ఈ వాస్తవాన్ని గుర్తించు. దుఃఖం గురువు లాంటిది. నిన్ను నిర్వాణాభిలాషిగా మార్చుతుంది.

**న కించిదస్తి తద్వస్తు యదభ్యాసస్య దుష్కరమ్**
**తస్మాన్మృదువ్యథాభ్యాసాత్ సోఢవ్యాని మహావ్యథా**

అభ్యాసానికి వశం కానిదంటూ ఏదీ లేదు. కనుక చిన్న చిన్న అసౌకర్యాలకు అలవాటు పడుతూ జీవిస్తే క్రమంగా సహనశక్తి వృద్ధి అవుతూ పెద్ద కష్టాలను కూడా సహించగలుగుతుంది. సుకుమారంగా జీవించాలనుకోవడం వరాక (despicable) లక్షణం.

**పిత్తాదిషు న మే కోపో మహాదుఃఖకరేష్వపి**
**సచేతనేషుకి కోపః తే ఽపి ప్రత్యయకోపితాః**

వాత పిత్త శ్లేష్మల వైషమ్యం (imbalanced state) వల్ల దేహంలో అనేక వ్యాధులు ఉత్పన్నములవుతూ నాకు విపరీతమైన బాధను కలిగిస్తాయి. అయినా వాత పిత్త శ్లేష్మల మీద నాకు కోపం రావడం లేదు. మానవుల వల్ల నాకు బాధ కలిగితే కోపం వెంటనే వస్తున్నది. ఎందుకీ వ్యత్యాసం? "వాతపిత్తాదులకు స్వతంత్ర కర్తృత్వం లేదు. ఆహార విహార దోషాల వల్ల అవి వైషమ్యం చెంది బాధను కలిగిస్తున్నాయి. స్వయంగా బాధను కలిగించడం లేదు కనుక వాటి మీద కోపం రావడం లేదు'' అని చెబితే మరి మానవులూ అంతే కదా! వాళ్ళున్నూ ఆయా హేతు ప్రత్యయములచే (causes and conditions) ప్రేరితులై నీకు బాధ కలిగించారు. స్వయంగా కాదు.

**గుణో ఽ పరశ్చ దుఃఖస్య యత్సంవేగాన్మదచ్యుతిః**
**సంసారిషు చ కారుణ్యం పాపాద్భీతిర్జినే స్పృహా**

దుఃఖం వల్ల గుణమూ (plus point) ఉన్నది. 1. మదాన్ని (intoxication) వదలగొట్టుంది. (కులమదం, ధనమదం, యౌవనమదం, విద్యామదం, అధికార మదం ఇంకా చాలా మదాలున్నాయి. పేరు ప్రఖ్యాతులున్న అధ్యాత్మ సంస్థలకు చెందిన వ్యక్తులు కొందరిలో మదం మరీ ఎక్కువ. దీనికి సంస్థాగతమదం అని పేరు పెట్టవచ్చు. అధ్యాత్మికత అంటే ఏమిటో సరైన అవగాహన లేకపోవడమే కారణం).

2. దుఃఖితుల ఎడల కారుణ్యం కలుగుతుంది.

3. ఇప్పటి దుఃఖానికి కారణం పూర్వం చేసుకొన్న తప్పిదాలని తెలిసి ఆ తప్పిదాలను చూసి భీతి చెందడం అనే లాభం కూడా కలుగుతుంది.

4. దుఃఖ నివారణోపాయం చెప్పిన భగవానుని పట్ల భక్తిశ్రద్ధలు కూడా కలుగుతుంది.

**త్రైలోక్యపూజ్యం బుద్ధత్వం సత్త్వానాం కిల వాంఛసి**
**సత్కారమిత్వరం దృష్ట్వా తేషాం కిం పరిదహ్యతే**

యజ్ఞదత్తుణ్ణి చూసి నాకెందుకీ కడుపుమంట? ప్రజలు అతణ్ణి గౌరవిస్తున్నారు, సత్కరిస్తున్నారు, పూజిస్తున్నారు. నన్నసలు ఎవరూ పట్టించుకోవడం లేదనేగా ఈ కడుపుమంట! ఇది తగదు. త్రిలోక వందనీయమైన బుద్ధత్వాన్ని అందరికీ ఆకాంక్షించే దీక్ష తీసుకొన్నవాడను. ఆ అందరిలో యజ్ఞదత్తుడూ చేరుతాడు. కనుక స్వల్పమైన అనిత్యమైన లాభ సత్కారాదులు అతడు పొందుతున్నాడని ఈర్ష్యపడడం నాకు తగదు.

**ముక్త్యర్థినశ్చాయుక్తం మే లాభసత్కారబంధనమ్**
**యే మోచయంతి మాం బంధాద్ద్వేషస్తేషు కథం మమ**

"గుణ దోషాలు అందరిలోనూ ఉంటాయి. నాలోనూ ఉన్నాయి. కానీ నేనంటే గిట్టనివాళ్ళు నా గుణాలను లెక్కలోకి తీసుకోకుండా కేవలం నాలోని చిన్న చిన్న దోషాలను మాత్రం ప్రజలకు భూతద్దంలో చూపి సమాజంలో నాకు తగిన గౌరవం లేకుండా చేశారు. వాళ్ళను ద్వేషించకుండా నేనెలా ఉండగలను?" ఇలా అనుకోవడం తప్పు. నేను ముక్తిని కాంక్షిస్తున్నాను. అన్ని బంధాల నుండి విముక్తిని కోరుతున్నాను. లాభ సత్కార పూజలు కూడా బంధమే. ఈ బంధము చుట్టుకోనీయకుండా నన్ను కాపాడినవాళ్ళుగానే వాళ్ళను భావించాలి. బాగా విచారించి చూస్తే నన్ను అపకీర్తిపాలు చేసినవాళ్ళే నాకు హితకారులు. వాళ్ళ మీద ద్వేషం తగదు.

***కిం చ నిశ్ఛద్మబంధూనామప్రమేయోపకారిణామ్***
***సత్త్వారాధనముత్సృజ్య నిష్కృతిః కా పరా భవేత్***

మహోపకారులు, లోకబాంధవులు అయినట్టి బుద్ధ బోధిసత్త్వులకు నేను చాలా ఋణపడియున్నాను. ఈ చీకటి ప్రపంచంలో ఉన్న నాకొక వెలుగు మార్గాన్ని బోధించి ఎనలేని ఉపకారం చేశారు. ఆ మహాత్ముల ఋణం తీరాలంటే నేను చేయవలసినది ఒక్కటే. సత్త్వారాధనం (propitiating living beings)

---

Note - *క్షాంతిని గురించి ఆలోచిస్తుంటే జగద్గురు దలైలామాగారు జ్ఞాపకానికి వస్తున్నారు ఆయనకు శాంతిదేవుని బోధిచర్యావతారం అంటే చాలా ఇష్టం ఉపన్యాసాల్లో తరచు శాంతిదేవుని వాక్యాలను ఉటంకిస్తుంటారు. ఈ మధ్య బోధిచర్యావతారం మీద ఇంగ్లీషులో ఎక్కువ అనువాదాలు రావడానికి కారణం బహుశా దలైలామా గారి ప్రభావమే కావచ్చు. అణచివేతకు గురియైన టిబెట్ విముక్తి కోసం ఆయన నిర్విరామంగా కృషిచేస్తున్నా చైనావాళ్ళ మీద కించిత్ ద్వేష వాక్యం కూడా పలుకని క్షాంతిశీలుడాయన*

# వీర్య పారమిత

*(Perfection of Vigour/Energy/Enthusiasm/Endeavour/Effort)*

పరిచయ వాక్యాలు

మంచి పనులు (కుశల కర్మలు = wholesome actions) చేయడంలో ఉన్న ఉత్సాహానికి వీర్యం అని పేరు. అకుశల కర్మల్లోనూ ఉత్సాహం కలిగినవాళ్ళున్నారు. దాన్ని వీర్యం అనరు. దాని పేరు కౌసీద్యం (laziness). stupidity అంటే ఇంకా బాగుంటుంది.

వీర్యానికి ఒక ఉదాహరణ : జపాన్ దేశంలో ఒక అందమైన యువతికి బౌద్ధవిహారంలో చేరి బ్రహ్మచర్యం (religious life/holy life) చరించాలనే తపన కలిగింది. సమీప ప్రదేశంలో ఉన్న ఒక విహారానికి వెళ్ళి ప్రవేశాన్ని కోరింది. ఆ విహారానికి పెద్ద అయిన భిక్షువు ఆమెను చూసి చకితుడై మనస్సులో "ఈమె అధ్యాత్మ జీవితానికి మిక్కిలి యోగ్యురాలు ముఖంలో లేశమాత్రం కూడా పృధక్జన లక్షణం (worldly nature) కనిపించడం లేదు. కానీ ఇంత అందమైన స్త్రీకి విహారంలో చోటిచ్చి ఆపైన లేనిపోని సమస్యలు ఎందుకు నెత్తికి తెచ్చుకోవాలి?" అనుకొని పైకి "అమ్మా, నేనిక్కడ స్వతంత్రుణ్ణి కాను. కొత్తవాళ్ళను చేర్చుకొనే అధికారం నాకు లేదు. ఆ అధికారం ఉన్న పెద్ద భిక్షువు సద్ధర్మపుండరీక (white lotus of the good law) సూత్ర గ్రంధాన్ని తీసుకరావడం కోసం భారతదేశం వెళ్ళాడు. ఎప్పుడు వస్తాడో తెలియదు. నీవు మరో విహారానికి వెళ్ళి ప్రయత్నించు" అని ఒక చిన్న అబద్ధం చెప్పి పంపించి వేశాడు. ఆమె నిరుత్సాహం చెందలేదు. దూర ప్రదేశాల్లోని విహారాలకు వెళ్ళి ప్రయత్నించింది. ఎక్కడా ప్రవేశం లభించలేదు.

కుంటిసాకులు ఏదో ఒకటి చెప్పి ప్రవేశాన్ని నిరాకరించారు. విహారాల్లో స్త్రీలున్నారు తనకు మాత్రం ప్రవేశం లభించలేదు. కారణాన్ని పసిగట్టి ఆమె ఇలా ఆలోచించింది . "అందంగా ఉండడం ఒక అనర్హత ఎలా అయ్యింది? నా అధ్యాత్మ జీవితానికి ఈ అందం ఒక అంతరాయంగా నిలిస్తే దీన్ని తృణప్రాయంగా వదిలించుకొంటాను ముఖాన్ని చూసే కదా జనులు 'అందం, వికారం' అని తీర్మానాలు చేసేది. కనుక ఈ ముఖాన్ని వికారం చేసుకొంటాను".

ఆమె ఏదో ద్రావకాన్ని సంపాయించి ముఖాన్ని నల్లగా కాల్చుకొని కురూపిగా మారి ఆపైన ఒక విహారంలో ప్రవేశం సంపాయించింది. అచిరకాలంలోనే అర్హతురాలయ్యింది. ఆ యువతిలోని వీరలక్షణం (spiritual heroism) తలచుకొంటే ఒళ్ళు పులకరిస్తుంది.

కౌసీద్యానికి ఉదాహరణగా ఒక దౌర్భాగ్యుడు జ్ఞాపకానికి వస్తున్నాడు. మహానుభావుడు టాల్‌స్టాయ్ ఆ దౌర్భాగ్యుణ్ణి గురించి ఒక కథలో చక్కగా చెప్పాడు చిన్నబ్బాయికి నేల (భూమి) ఆశ ఎక్కువ. పదేండ్ల క్రితం పెద్దబ్బాయి నుండి వేర్లు పోయినపుడు తన భాగంగా నాలెగెకరాల మాగాణి వచ్చింది. అది చాలు జీవితం సుఖంగా గడవడానికి. కానీ చిన్నబ్బాయి నుదుట సుఖం అనే గీత లేదు. పదేండ్లు అష్టకష్టాలు పడి నాలుగెకరాలకు మరో పది ఎకరాలు చేర్చాడు. అయినా తృప్తి లేదు. ఎవరైనా బైటి ఊరివాళ్ళు కనిపిస్తే చిన్నబ్బాయి తప్పనిసరిగా అడిగే మొదటి ప్రశ్న "మీ ఊర్లో భూముల ధర ఎలా పలుకుతున్నది?" సరసంగా ఎక్కడైనా లభిస్తే ఓ వంద ఎకరాలు ఒక్కసారిగా కొనాలని అతని భూతృష్ణ అతని పేరాశను ప్రజ్వలింపజేసే సమాచారం ఒకనాడు అతనికి అందింది. "అక్కడికి ఉత్తరంగా అరవై మైళ్ళ దూరంలో గిరిజన గూడాలున్నాయి భూములు కారుచౌక వంద ఎకరాలేమిటి, పదివేల ఎకరాలైనా తేలిగ్గా కొనవచ్చు".

చిన్నబ్బాయి ఒక క్షణం కూడా ఆలస్యం చేయలేదు. వెంటనే ఉత్తరాదికి

బయలుదేరాడు. సాయంత్రానికి ఆ గిరిజన గూడెం చేరి గూడెం పెద్దను కలిసి "నాది దక్షిణాది. ఇక్కడ భూములు సరసమైన ధరకు లభిస్తాయని తెలిసి కొనడానికి వచ్చాను" అన్నాడు. "మేము భూములను అమ్మము. నీకు కావలసినంత భూమిని ఉచితంగా ఇస్తాము. ఇక భోజనం చేసి విశ్రాంతి తీసుకోండి. రేపు ప్రొద్దున సూర్యోదయానికి ముందే లేచి భూముల వద్దకు వెళ్ళాలి" అన్నాడు గూడెం పెద్ద.

మరునాడు సూర్యోదయానికి ముందే గూడెం పెద్ద, చిన్నబ్బాయిని రెండు కొండల మధ్యకు తీసుకెళ్ళి అక్కడొక జెండా పాతి చిన్నబ్బాయి చేతికి మరొక జెండా ఇచ్చి "అల్లదిగో నున్నగా కనిపిస్తున్నదే ఆ కొండ, ఇక్కడికి సరిగ్గా ఇరవై మైళ్ళ దూరం. ఈ రెండు కొండల మధ్య భూమి అంతా మా అధీనంలో ఆ కొండ వరకు ఉంది. ఈ జెండా నీకు ఇవతలి హద్దు. అవతలి హద్దు నీ ఇష్టం నీకు కావలసిన హద్దులో జెండా పాతి సూర్యాస్తమయంలోగా ఈ జండా వద్దకు చేరాలి. సూర్యభగవానుడి సాక్షిగా ఇది మన ఒప్పందం. మేము ఉత్తరాదివాళ్ళం మాటంటే మాటే. దక్షిణాదివాళ్ళ కుయుక్తులు మాకు లేవు. ఇక బయలుదేరు" అన్నాడు.

"సూర్యాస్తమయం దాక ఎందుకు? ఆ విప్పచెట్టు దగ్గర జెండా పాతి ఐదు నిమిషాల్లో వస్తాను" అని చిన్నబ్బాయి బయలుదేరాడు. అతనికి మహదానందంగా ఉంది. "ఉత్తరాదివాళ్ళు ఒట్టి వెఱ్ఱి వెంగళప్పలు అనేవాడు మా తాత. కానీ ఇంత వెఱ్ఱి వెంగళప్పలుగా ఉంటారని నేను ఊహించలేదు బంగారం లాంటి భూమిని ఉచితంగా ఇచ్చేవాళ్ళెవరైనా ఉంటారా? అదీ కోరినంత" అనుకుంటూ విప్పచెట్టు వరకు నడిచాడు. జెండా నాటలేదు. "ఆ వంక హద్దుగా ఉంటే బాగుంటుంది" అనుకొని ముందుకు నడిచాడు. "ఈ బిట్టులో పసుపు వేసి అరటిచెట్లు పెట్టేస్తే మంచి ఆదాయంగా ఉంటుంది" అనుకొంటూ హద్దు నిర్ణయాలు మార్చుకొంటూ మిట్టమధ్యాహ్నం దాకా నడిచాడు. జెండా దించలేదు.

నడిచి నడిచి కాళ్ళు నొప్పులుగా ఉంది అయినా ఆశాపాశబద్ధుడై ముందుకు లాగబడుతూ పోతూనే ఉన్నాడు. "పెండ్లి నడకగా కాకుండా ఇంకాస్త వేగంగా అడుగులు వేసియుంటే ఈ పాటికి ఆ కొండ చేరియుండేవాడిని. మించిపోయింది లేదు. ఇంకో గంటలో అక్కడికి వెళ్ళవచ్చు" అని నడక వేగం పెంచాడు. కొండ అంచు చేరాకనే జెండా దించాడు.

* * *

సూర్యుడు అస్తమించబోతున్నాడు. చిన్నబ్బాయికి జెండా కనిపిస్తున్నది ఆ జెండా వద్ద గిరిజనులందరూ గుంపుగా నిలబడి పరుగెత్తి వస్తున్న తనను చేసి పగలబడి నవ్వుకొంటూ ఉండడం కనిపిస్తూనే ఉంది. తిరుగు ప్రయాణంలో దేహం మొదట్నుంచీ మొరాయించినా పళ్ళ బిగువుతో ఇంతవరకు లాక్కొచ్చాడు సూర్యుడస్తమించబోతున్నాడు. ఇంక కొన్ని అడుగుల దూరమే జెండా. కానీ దేహం తూలి క్రింద పడిపోయేలా ఉన్నది. చిట్టచివరి ప్రయత్నంగా చిన్నబ్బాయి, దేహంలో మిగిలియున్న మొత్తం శక్తిని కూడదీసుకొని చేతులు ముందుకు చాపి డైవ్ చేసి బోర్లాపడి హద్దును తాకాడు. మళ్ళీ లేవలేదు. గూడెంవాసులు అతని శవానికి అవసరమైన ఆరడుగుల పల్లం తవ్వి శవాన్ని పూడ్చివేసి గూడెం చేరారు.

చిన్నబ్బాయిని తలచుకొంటే చాలా జాలి వేస్తుంది. He is a man of tremendous energy but unfortunately misdirected బోధిసత్త్వుల వీర్యం తీరు వేరుగా ఉంటుంది. ఉదా : బోధిసత్త్వుడు ఒకానొక కాలంలో సార్థవాహుడుగా (Caravan leader) ఉండడం జరిగింది. సముద్రం లాంటి విశాలమైన ఎడారికి ఇవతల అవతల ఉన్న దేశాల మధ్య వర్తకం చేసేవాళ్ళకు నాయకుడుగా ఉంటూ ఒకసారి వర్తకబృందాన్ని ఎడారిలో నడిపించాడు. ఎడారి, పగటివేళ వేడెక్కిపోయి ప్రయాణం అసాధ్యంగా ఉంటుంది కనుక ఆయన వర్తకబృందాన్ని రాత్రివేళల్లో నడుపుతూ పగలు ఎక్కడో ఒకచోట డేరాలు వేసి విశ్రాంతి తీసుకొంటూ ప్రయాణిస్తున్నాడు. సముద్రం మధ్యలో ఎలా దిక్కులు తోచవో ఎడారిలోనూ

అంతే. ఆయన చాలా అనుభవజ్ఞుడు కనుక రాత్రివేళల్లో కనబడే నక్షత్రాల ఆధారంతో లెక్కలు గట్టి మార్గనిర్దేశం చేసేవాడు. "ఇంత దూరం ప్రయాణం చేశాము, ఇంకా ఇంత దూరం ప్రయాణించవలసియున్నది" అని కూడా ఖచ్చితంగా చెప్పగలిగేవాడు.

ఒకనాటి ఉదయం ఆయన వర్తక బృందాన్ని ఒకచోట విడిది చేయించి ఇలా అన్నాడు "సోదరులారా, సుదీర్ఘమైన ఈ ఎడారి ప్రయాణంలో చివరి మజిలీ చేరాము. సాయంకాలం బండ్లు కట్టి కదిలామంటే తెల్లవారేసరికి హిరుక దేశంలో ఉంటాము. ఇన్నాళ్ళు మనం జలాన్ని చాలా పొదుపుగా వాడుకొంటూ వస్తున్నాము. ఇప్పుడు మీకు నేను స్వేచ్ఛ ఇస్తున్నాను. యధేచ్ఛగా వాడుకోవచ్చు. జలఘటముల భారం ఇక అక్కరలేదు."

సాయంత్రం బండ్లు కదిలాయి. జటఘటాల భారం, వంట కట్టెల భారం తగ్గిపోవడంతో బండెనక బండి కాస్త వేగంగా కదిలాయి. ముందుబండిని నడిపే వ్యక్తికి అవసరమైన అన్ని సూచనలు ఇచ్చి బోధిసత్త్వుడు ఆ బండిలోనే కూర్చున్నాడు. నాయకులుగా ఉన్నవాళ్ళను చూసి ఇతరులు ఈర్ష్యపడవచ్చుగానీ పాపం వాళ్ళకు నిద్రాసుఖం కూడా అంతంత మాత్రమే అనే విషయం ఇతరులకు తెలియదు. అన్ని దినాల ప్రయాణంలో బోధిసత్త్వుడు నిదురించింది చాలా తక్కువ. రాత్రివేళల్లో పూర్తిగా మేలుకొని నక్షత్రాలను గమనిస్తూ మార్గనిర్దేశం చేస్తూ వచ్చాడు. పగటివేళ కూడా నిద్రకు తగిన సమయం లభించేది కాదు. విడిది ఏర్పాట్ల పర్యవేక్షణ, జల వినియోగ పర్యవేక్షణ, మళ్ళీ ప్రయాణ సన్నాహం - ఇలా పనీ మీద పని అతణ్ణి నిదురకు దూరం చేసింది. ఆ రాత్రి కూడా అర్ధరాత్రి దాకా అతి ప్రయత్నంతో మేలుకొనే ఉన్నాడు. కంటిరెప్పలు చెప్పినమాట వినడం లేదు. మూసుకొంటున్నాయి. బొటనవేలు చూపుడువేలు సహాయంతో కంటి రెప్పలను మూతపడనీయకుండా పట్టి ఉంచుతూ మార్గాన్ని గమనిస్తున్నాడు. "ఇంకో నాలుగైదు గంటల శ్రమే కదా" అనుకొంటుండగానే కునికిపాటుకు గురియైనాడు. చేతులు క్రిందికి జారిపోయాయి.

రెప్పలు మూతపడ్డాయి. గాఢనిద్రలోకి వెళ్ళిపోయాడు. బండిని నడుపుతున్నవాడు అంతకు మునుపే హాయిగా నడుం వాల్చేసియున్నాడు.

* * *

ఇంక కొన్ని నిముషాల్లో తెల్లవారబోతుందనగా బోధిసత్త్వునికి మెలకువ వచ్చింది. తటాలున లేచి ముందుకు చూపులు సారించాడు. గుండె ఝల్లుమనింది. నిన్నటిదినం విడిది చేసిన ప్రదేశం అల్లంత దూరంలో కనిపిస్తూ ఉంది. నిన్న అక్కడ వదలివేసిన ఖాళీ ఘటాలు, చెత్తా చెదారం దర్శనం ఇస్తున్నాయి. బండిని నడిపే ఆయన ఇంకా నిదురలోనే ఉన్నాడు. అతణ్ణి ఒక తన్ను తన్ని లేపి "ఏమిటిది?" అని ఆ ప్రదేశాన్ని చూపించాడు. అతడు దాన్ని చూసి స్థాణువులా అయిపోయాడు. నోట మాట పెగల్లేదు. బండెనక బండి అన్నీ బారుగా మొదటి బండి వెనకనే కదిలి వస్తున్నాయి. జరిగిన విషయమేమిటంటే అర్ధరాత్రి దాటాక, సరియైన మార్గనిర్దేశం చేసేవాళ్ళు లేకపోయేసరికి ఆ ముందుబండి ఎద్దులు యథేచ్ఛగా పోతూ ఎక్కడో ఒక చోట మలుపు తిరిగి నిన్నటి స్థలానికే ప్రయాణించాయి. వెనుక బండ్లూ ఆ ముందు బండిని అనుసరించాయి.

"అయ్యో, ఎంత ఘోరం జరిగిపోయింది! నన్ను నమ్మి నా వెంట నడచిన ఇందరి గతి ఏమి కాను! నేనెలా వీళ్ళను ఈ ఘోర విపత్తునుండి కాపాడగలను? ఇప్పుడు కావలసింది నీళ్ళు. పశువులకు మనుషులకు అత్యవసరంగా కావలసింది నీళ్ళు" అని చింతన చేస్తుండగానే తెల్లవారింది. బోధిసత్త్వుడు మహావీర్యవంతుడు తాను సంకల్పించిన దానికోసం తుది శ్వాస వరకు పోరాడే మనస్తత్వం. ఫలితం ఎలా అయినా ఉండనీ, పనిలో మాత్రం ప్రయత్నలోపం ఉండరాదనే పట్టుదల మనిషి. ఎడారిని నాలుగు దిక్కులూ జాగ్రత్తగా పరిశీలించి చూశాడు. దూరంలో ఒకచోటు, కాస్త భిన్నమైన రంగులో కనిపించింది. వేగంగా అక్కడికి వెళ్ళాడు. వెనుకనే ఒక యువకుడు అనుసరించాడు

బోధిసత్త్వునికి అక్కడ దర్భలాంటి చిన్న మొక్కలు కొన్ని కనిపించాయి.

"చుట్టూ ఎక్కడా ఒక గడ్డిపోచ కూడా కనిపించని ఈ ఎడారిలో ఇక్కడ మాత్రం ఈ మొక్కలు మొలిచియున్నాయి. వీటిని ఎవరూ నీళ్ళు పోసి పెంచలేదు. వీటికి కావలసిన తేమ భూమినుండే లభిస్తున్నది. కనుక ఇక్కడ భూగర్భంలో తప్పక జలం లభిస్తుంది. వెంటనే ఇక్కడ కూపం త్రవ్వే పని ఎత్తుకోవాలి" అని ప్రక్కనున్న యువకునికి చెప్పి వర్తకులను అందర్నీ అక్కడకు రమ్మని చేతులు ఊపి పిలిచాడు.

జీవన్మరణ సమస్య కనుక ప్రతి ఒక్కడిలోనూ అంతర్లీనంగా ఉన్న శక్తి ఇబ్బడి ముబ్బడిగా వ్యక్తం అయ్యింది. త్రవ్వకం పని మహావేగంగా జరుగుతున్నది. పది అడుగులు ఇరవై అడుగులు ముప్పై నలభై ఏభై అడుగులు త్రవ్వారు. నీళ్ళు పడలేదు. బోధిసత్త్వుడు వాళ్ళను ఉత్సాహపరుస్తూ "ఇంకా త్రవ్వండి. తప్పక నీళ్ళు పడతాయి" అని పురమాయించాడు. అరవై అడుగుల లోతుకు పోయాక కూడా నీళ్ళు పడలేదు. బండ పడింది. ఒక్కసారిగా అందరిలోనూ నిరుత్సాహం కమ్ముకొనింది. ఇక చేసేది ఏమీ లేదని తట్టలు పార పలుగులు పారవేసి అందరూ ఒడ్డు మీదికి వచ్చి చతికిల బడినారు. బోధిసత్త్వుడు నిరుత్సాహం చెందలేదు. ఆ బండకు చెవి ఆనించి బహు జాగ్రత్తగా ఆలకించాడు. జలప్రవాహశబ్దం లీలగా వినిపించింది. అందరిలా నిరుత్సాహం చెందకుండా తన వెంటే నిలిచి ఉన్న ఆ యువకునితో "బలభద్రా, ఇక పార పలుగులు అవసరం లేదు. ఆ సమ్మెటను చేతికి తీసుకో. కొండలను పిండి చేసే శక్తి నీ కండరాలకున్నది. ఈ బండను పగులగొట్టు" అని ఉత్తేజాన్ని కలిగించాడు. సముద్ర లంఘన సమయంలో ఆంజనేయస్వామి పొందినంత ఉత్తేజం ఆ యువకునికి కలిగింది. సమ్మెటను చేతికి తీసుకొన్నాడు. ఖణేళ్ ఖణేళ్మనే సమ్మెట పోటుల ఉధృతికి ఆ బండ పగుళ్ళిచ్చింది. భూమాత గర్భం నుండి సకల జీవాధారమైన పుణ్య జలం జివ్వుమని పైకి చిమ్ముతూ ఉబికింది. క్షణాల్లో ఆ కూపం నిండిపోయింది.

# వీర్య పారమిత

*(Perfection of Vigour/Energy/Enthusiasm/Endeavour/Effort)*

కుశల కర్మల యందు ఉత్సాహాన్ని వీర్యం అంటారు. వీర్యాన్ని తలెత్తనీయకుండా అడ్డుకొనే ప్రతిపక్షములు నాలుగు. 1. ఆలస్యం (laziness=bodily and mental laziness = అకర్మణ్యత), 2. కుత్సితాసక్తి (హాస్యలాస్యదులయందు ఆసక్తి hankering for entertainments), 3. విషాదం (despondency = నైరాశ్యం), 4. ఆత్మావమన్యన (తనను తాను తక్కువగా అంచనా వేసుకోవడం).

నిష్ప్రయోజనమైన (useless, purposeless, fruitless) పనులు చేయడానికి మనస్సు ఇచ్ఛగించదు. అశక్యమైన (impossible) పనులు చేయడానికీ మనస్సు ఇచ్ఛగించదు. అనభిమతమైన (ఇష్టం కాని/సమ్మతం కాని) పనులు చేయడానికీ మనస్సు ఒప్పుకోదు. సోమరితనం (అలసత్వం) లేకుండా జీవించాలంటే ప్రయోజనకరమైన (useful), శక్యమైన (possible), అభిమతమైన (ఇష్టమైన) పనులు పెట్టుకోవాలి. పనులను ప్రేమించి చేస్తున్నవాడికి కుత్సితాసక్తికి సమయమే లభించదు. విషాదానికి చోటుండదు. శక్యమైన పని కనుక ఆత్మావమన్యన ఉండదు.

అభద్రమైన అనిత్యమైన కరుణారహితమైన ఈ లోకంలో జీవిస్తూ కూడా దీని భయంకరత్వాన్ని గమనించలేని తెలివితక్కువతనం (complacency = అనుద్విగ్నత = సంవేగం చెందకపోవడం) సోమరితనాన్ని కలిగిస్తుంది.

**నిరుద్యమ ఫలాకాంక్షిన్ సుకుమార బహువ్యథ**
**మృత్యుగ్రస్తో ఉమరాకార హా దుఃఖిత వినశ్యసే**

అయ్యో దుఃఖితుడా, నీ జీవితం ఒక వైరుధ్య నిలయం. ఫలాన్ని

కోరుతావు, పనిని మాత్రం చేయవు. సుకుమారంగా ఉండాలని తాపత్రయపడతావు. బహువ్యధలు (దుఃఖాలు, బాధలు) కలిగించుకొంటావు. మృత్యువు వదనంలో ఉన్నావు, శాశ్వతుడను అనుకొంటున్నావు. ఎప్పుడో ఒకప్పుడు తటాలున చస్తావు. జాగ్రత్త!

**మానుష్యం నావమాసాద్య తర దుఃఖమహానదీమ్**
**మూఢ కాలో న నిద్రాయా ఇయం నౌర్దుర్లభా పునః**

మూఢుడా, నిద్రకిది సమయం కాదు. దుఃఖమహానదిని దాటి ఆవలి తీరం త్వరగా చేరు. ఈ నావ (మానుష్యం) మళ్లీ అంత తేలిగ్గా లభించదు.

ఏ రంగంలోనైనా సరే వీర్యవంతుడే రాణిస్తాడు, విజయం సాధిస్తాడు. కనుక,

**యదేవాపద్యతే కర్మ తత్కర్మవ్యసనీ భవేత్**
**తత్కర్మశౌండో ఉతృప్తాత్మా క్రీడాఫలసుఖేప్సువత్**

చిన్నపిల్లలు ఆటలాడేటప్పుడు అలుపు సొలుపులను లెక్కించకుండా ఇంకా ఇంకా ఆడాలనే తపన చూపిస్తూ ఆ ఆడడంలోనే సుఖాన్ని చవిచూస్తూంటారు కదా! అలాగే మనం, మనం చేయవలసిన పనుల్లో ఇష్టాన్ని చూపిస్తూ చేయాలి.

**సుఖార్థం క్రియతే కర్మ తథాపి స్యాన్న వా సుఖమ్**
**కర్మైవ తు సుఖం యస్య నిష్కర్మా స సుఖీ కథమ్**

పనుల మీద ఇష్టం లేకుండా కేవలం ఫలాపేక్షతో చేసే పనుల వల్ల - ఆ ఫలం వస్తుందో రాదో అటుంచుదాము-చేసినంతకాలం ఏదో బరువుగా ఆయాసంగా ఉంటుంది కదా! కనుక పనిచేయడంలోనే సుఖం అనుభవించేవాడు అదృష్టవంతుడు. ఊరక కూర్చోవడం అంటే సుఖానికి దూరం అయినట్లనుకొంటాడు.

(పనులు చేయడంలోనే ఆనందం పొందేవాడు ఆ పనుల వల్ల ఫలం లభిస్తే తీసి ఏట్లో పారవేయడు. ఇంటికి తెచ్చుకొంటాడు. ఫలం లభిస్తేనూ ఓకే, లభించకపోయినా ఓకే. నిష్కామకర్మ అంటే ఇదే. disinterested activity కానే కాదు.)

# ధ్యాన పారమిత

*(Perfection of meditative absorption)*

పరిచయ వాక్యాలు

శాంతిదేవుడు ఈ అధ్యాయంలో ప్రధానంగా ధ్యాన అంతరాయాల విషయం చెప్పాడు. ధ్యాన అంతరాయాలకు నీవరణములు (hindrances) అని పేరు. అవి ఐదు : 1. కామచ్ఛంద (sensuous desires), 2. వ్యాపాద (ill-will, malice, hatred), 3. స్త్యానమిద్ధ (sloth and torpor), 4. ఔద్ధత్య కౌకృత్య (restlessness and regret), విచికిత్స (doubt). మొదట చిత్తాన్ని ఈ ఐదు నీవరణముల నుండి విముక్తం చేసుకొంటే ఆ పైన మనకు ఇష్టమైన ధ్యానాన్ని తీసుకోవచ్చు.

జెన్ గురువు వద్దకు ఒకడు వచ్చి ధ్యానం నేర్పమన్నాడు. "ధ్యానం వల్ల ఏమి సాధించాలనుకొంటున్నావు?" ప్రశ్నించాడు జెన్ గురువు. "ధ్యానం వల్ల బుద్ధత్వాన్ని సాధించదలచాను" అన్నాడు అతడు. "బుద్ధత్వం సాధించి ఏమి చేయదలచావు?" మళ్ళీ ప్రశ్నించాడు గురువు. "లోకాన్ని కాపాడదలచాను" అన్నాడు అతడు. ఆ జెన్ గురువు చేతిలో బెత్తం (cane) ఉన్నది. అతణ్ణి ఆ బెత్తంతో బలంగా ఒకటి అంటించాడు. అతడు బాధను తట్టుకోలేక "అబ్బా" అని అరచాడు. "ఈ బెత్తమే కత్తి అయ్యుంటే నీ ప్రాణాలు ఈ పాటికి గాలిలో కలిసిపోయి యుండేవి. ముందు నిన్ను నీవు కాపాడుకోవడం నేర్చుకో. ఆపైన లోకాన్ని కాపాడవచ్చు". అంటూనే మళ్ళీ బెత్తంతో ఒకటి తగిలించాడు. అతడు మళ్ళీ "అబ్బా" అని అరచాడు. "బుద్ధుడు నీకు ఎక్కడైనా దారిలో కనిపిస్తే ఏమి చేస్తావు?" ప్రశ్నిస్తూనే తటాలున మళ్ళీ బెత్తంతో దెబ్బ వేయబోయాడు. ఈ సారి

అతను ఆ దెబ్బను తప్పించుకొన్నాడు. "శభాష్ అలా చురుకుగా (alert) ఉండాలి. ఇక్కడ ఉంటూ ఈ తోటపని చూసుకో. పని బాగా చేయాలి. నీవు పని చేస్తుంటే తటాలున నేను ఏ వైపు నుండైనా వచ్చి బెత్తంతో దాడిచేస్తుంటాను. తప్పించుకోవడం నీ సమస్య" అన్నాడు గురువు.

బెత్తం దెబ్బలు తప్పించుకోవడానికి ధ్యానానికి ఏమిటి సంబంధం? అతనికి బోధపడలేదు. "కొన్నాళ్ళుండి చూస్తాం" అనుకొని తోటపనిలోకి దిగాడు.

చెట్లకు నీళ్ళు పెట్టున్నా, కలుపు తీస్తున్నా, రాలిన ఆకులను పోగుజేస్తున్నా అతను ఒక ప్రక్క చాలా గమనిక వహిస్తూ వచ్చాడు. ఇంద్రియాలను తీక్షణంగా (sharp) ఉంచుకొన్నాడు. గురువు మొదట్లో ఎదుట్నుంచి బెత్తం దాడి చేస్తూ ఆపైన ప్రక్కవైపుల నుండి ఆపైన వెనుక నుండి ఆ తరువాత పై దిక్కునుండి (చెట్టు నుండి తటాలున దూకి అని అర్థం) దాడులు చేస్తూ వచ్చాడు. శిష్యుడు అప్పుడప్పుడు దెబ్బలు తిన్నా క్రమంగా తప్పించుకోవడంలో విజయం సాధిస్తూ వచ్చాడు. వెనుక తట్టు నుండి గురువు పిల్లిలా నిశ్శబ్దంగా అడుగులు వేస్తూ వచ్చినా, శిష్యుని దేహం ఆ ప్రకంపనలను (vibrations) కూడా పసిగట్టగల చురుకుదనం (alertness) వృద్ధి చేసుకొనింది. జాగ్రదవస్థలో అతని మీద దాడి చేసి కొట్టడం గురువుకు ఇక అసాధ్యమనిపించింది. శిష్యుడు నిద్రావస్థలో ఉన్నప్పుడు దాడి ప్రారంభించాడు. శిష్యుడు మొదట చాలా దెబ్బలు తిన్నప్పటికీ క్రమంగా ఆ అవస్థలోనూ తప్పించుకొనే చురుకుదనం అతని దేహంలో వృద్ధి చెందుతూ పరాకాష్ఠకు చేరింది. ఒక అర్ధరాత్రి దాడి చేయడం కోసం వచ్చిన గురువు అది సాధ్యం కాకపోయేసరికి చేతిలోని బెత్తాన్ని పారవేసి శిష్యుణ్ణి ప్రశంసాదృష్టితో చూస్తూ "శిష్యా, గత ఐదు సంవత్సరాలుగా నీవిక్కడ ఉన్నప్పటికీ నీకు నేను ఒక ముక్క కూడా చదువు చెప్పలేదు. ఎందుకో మరి ఇప్పుడు ఈ వేళ నీకు బుద్ధవచనం కొంచం వినిపించాలనిపిస్తున్నది. ఇటు వచ్చి కూర్చో. వజ్రచ్ఛేదిక సూత్రాన్ని (Diamond cutter surtra or simply Diamond sutra)

చెబుతాను" అన్నాడు జెన్ గురువు.

"నమో భగవత్యా ఆర్యప్రజ్ఞాపారమితాయై" అని నమస్కారవచనం పలికి **"ఏవం మయా శ్రుతమ్...** అని సూత్రాన్ని చెప్పడం మొదలుపెట్టాడు. శిష్యుడు పరమ ఏకాగ్ర చిత్తంతో వింటున్నాడు. పది నిముషాలయ్యింది.

**"తస్మాత్తర్హి సుభూతే బోధిసత్త్వేన ఏవమప్రతిష్ఠితం చిత్తముత్పాదయితవ్యం యన్న క్వచిత్ప్రతిష్ఠితం చిత్తముత్పాదయితవ్యం. న రూపప్రతిష్ఠితం చిత్తముత్పాదయితవ్యం. న శబ్ద గంధ రస స్ప్రష్టవ్య ధర్మ ప్రతిష్ఠితం చిత్తముత్పాదయితవ్యం*. .........."** ఈ వాక్యం వద్ద శిష్యునికి పరమార్థం (ultimate truth) మెరుపులాగా తటాలున అవగతమై పోయింది (instant realisation కలిగింది). గురువు ఆ విషయం గ్రహించి సూత్ర పారాన్ని ఆపి వేసి "పరమార్థం ఏమిటో చెబుతావా?" అని శిష్యుణ్ణి ప్రశ్నించాడు. శిష్యుడు మౌనం వహించాడు. ఆ మౌనం సాధారణ మౌనం కాదు. భీషణంగా గర్జించే మౌనం (Thundering Silence).

ధ్యాన అంతరాయములైన నీవరణములకు (hindrances) ఒక పోలిక. నానారంగులు కలిసిన జలం లాంటిది కామచ్ఛందంతో కూడిన చిత్తం. కుతకుత మరుగుతున్న (boiling) జలం వంటిది వ్యాపాదచిత్తం. పాచి పట్టిన జలం లాంటిది స్త్యానమిద్ధ చిత్తం. అల్లకల్లోలంగా ఉన్న జలం వంటిది ఔద్ధత్యకౌకృత్య చిత్తం. మడ్డి నీళ్ళ వంటిది (muddy water) విచికిత్సా చిత్తం. ఈ ఐదు రకాల జలంలో ప్రతిబింబం కనబడదు. అలాగే పై ఐదు రకాల నీవరణములతో కూడిన చిత్తంలోనూ సత్యం గోచరించదు. మంచి, చెడ్డల విభాగం తెలియదు.

---

* *Therefore then, Subhuthi, the Bodhisattva, the Great Being, should produce an unsupported thought, i.e. a thought which is nowhere supported, a thought unsupported by sights, sounds, smells, tastes, touchables or mind-objects (translation Edward Conze)*

మహానాగభిక్షువు అనుపూర్వ నిరోధ సమాపత్తులను (successive extinctions=enstatic practices) బాగా అభ్యసించినవాడు. అనూరాధాపురంలోని ఒక ధ్యానమందిరం లోకి వెళ్ళి ఆసనం వేసుకొని కూర్చున్నాడు. కళ్ళు మూసుకొన్నాడు. నీవరణములు లేని చిత్తం కనుక వెంటనే ఒకటవ ధ్యానంలోకి వెళ్ళిపోయాడు. వితర్క విచారాలను (applied thought, sustained thought) నిరోధించాడు, రెండవ ధ్యానంలోకి వెళ్ళాడు. ప్రీతిని (rapture) నిరోధించాడు, మూడవ ధ్యానంలోకి వెళ్ళాడు. సుఖాన్ని (joy) నిరోధించాడు, నాలుగవ ధ్యానంలోకి వెళ్ళాడు. రూపసంజ్ఞను (corporeality perceptions) నిరోధించాడు, ఆకాశానంతాయతన సమాపత్తిలోకి (sphere of boundless space) వెళ్ళాడు. ఆకాశానంతాయతన సంజ్ఞను నిరోధించాడు, విజ్ఞానానంతాయతనంలోకి (sphere of boundless consciousness) వెళ్ళాడు. విజ్ఞానానంతాయతన సంజ్ఞను నిరోధించాడు, అకించనాయతనంలోకి (sphere of nothingness) వెళ్ళాడు. అకించనాయతన సంజ్ఞను నిరోధించాడు, నైవసంజ్ఞానాసంజ్ఞాయతనంలోకి (sphere of neither perception nor non-perception) వెళ్ళాడు నైవసంజ్ఞానాసంజ్ఞాయతన సంజ్ఞను నిరోధించాడు, సంజ్ఞావేదనీయ నిరోధ సమాపత్తిలోకి (extinction of perception and feeling) వెళ్ళాడు. ఈ స్థితికే భవాగ్రమని పేరు (summit of phenomenal existence).

ఆ ధ్యానమందిరంలో ఇంకా కొందరు భిక్షువులు కూర్చొనియున్నారు. ఒక ఉపాసకుడు (lay disciple = గృహస్థ శిష్యుడు) కూడా ధ్యానంలో కూర్చున్నాడు. అతడు బ్రహ్మ విహారాల (sublime/divine abodes) భావనలోకి దిగాడు. ఈ భావనకు మరో పేరు అప్రమాణములు (immeasurable states). అవి ఏవనగా మైత్రి (loving kindness), కరుణ (compassion), ముదిత (joy), ఉపేక్ష (equanimity). మైత్రీభావన మొదట తన మీదనే ప్రారంభించాలి - “నేను సుఖంగా ఆనందంగా ఆరోగ్యంగా ఉండాలి” అని. ఆపైన ఇష్టమిత్రుని మీద,

ఆపైన ఒక మాదిరి మిత్రుడు, ఆ తరువాత ఉదాసీనుడి (neutral person) మీద, చివరగా అనిష్టుల మీద మైత్రీ భావనను ప్రసరింపజేస్తూ ఈ భావనను అభ్యసించాలి. ఈ భావనను ఆ తరువాత పది దిక్కుల్లోని మొత్తం విశ్వానికి-సకల జీవరాశికి-ప్రసరింపజేయాలి. తక్కిన మూడు భావనలను కూడా ఆయా పద్ధతుల్లో భావన చేయడం బ్రహ్మ విహార భావన అవుతుంది. ఆ ఉపాసకుడు మైత్రీ భావన చేస్తూ చేస్తూ ఉన్నట్లుండి లేచి ఇంటికి పరుగెత్తాడు. ధ్యానం చేసేవాళ్ళు లేచినపుడు తప్పనిసరిగా ఆసనాన్ని తీసి మళ్ళించి చంకలో పెట్టుకొని పోవడం చూస్తాము. కానీ అతను ఆసనాన్ని అలానే వదిలివేసి ఇంటికి వేగంగా పరుగెత్తాడు. అలా ఎందుకు పరుగెత్తాడు అనే విషయం ఈ లోకంలో చెప్పగలిగింది విశుద్ధిమగ్గను రచించిన బుద్ధఘోషుడు ఒక్కడే. ఆ ఉపాసకుడు మైతీభావన తొలిదశలో చేయకూడని ఒక తప్పు చేశాడు. తొలిదశలో ఆ భావనకు ఆలంబనంగా (object గా) opposite sex ని తీసుకోరాదు. అతను ధ్యానంలో కూర్చున్న వెంటనే మైత్రీభావనకు భార్యనే తీసుకొన్నాడు. ఆమె మీద ఆ భావనను కొనసాగిస్తుంటే మైధునవాంఛ ఉవ్వెత్తున లేచి ఇంటికి పరుగెత్తాడు.

మహానాగుడు నిరోధ సమాపత్తిలోకి త్వరగా వెళ్ళిపోయాడు కానీ అక్కడ కూర్చొన్న తక్కిన భిక్షువులు నీవరణములతోనే సతమతమవుతున్నారు. అందులో ఒకడు బుద్ధానుస్మృతి (contemplation of Buddha) చేయాలని కళ్ళు మూసుకొంటే బుద్ధుడు మనస్సులోకి రాలేదు. ఎన్నడో పూర్వాశ్రమంలో చూసిన ఒక వీధినాటక దృశ్యం వచ్చి దూరింది. అందులో భీముడి వేషం వేసినవాడు దుర్యోధనుణ్ణి కోపంగా చూసి పద్యం చెబుతూ బుట్టమీసాలు మెలివేస్తాడు. అవి అతికించుకొన్న మీసాలు. చేతిలోకి ఊడివచ్చాయి! ఇలా తక్కిన భిక్షువులు కూడా ఎవరి విక్షేపాలతో వాళ్ళు సతమతమవుతూ ఉన్నారు. ధ్యానం కుదరడం లేదు.

కూర్చోవడం విసుగ్గానే ఉంది. లేచి వెళ్ళిపోతే ఇతరులేమనుకొంటారో అన్నే జంకుతో దంభంగా* కూర్చొనియున్నారు.

ఆ ధ్యానమందిరం చెక్కలతో నిర్మితమైన ధ్యానమందిరం. ఎక్కడో ఏదో పొరబాటు జరిగి ఆ దినం అగ్నిప్రమాదానికి గురి అయింది. భిక్షువులందరూ బైటకు దూకేశారు. మందిరం నాలుగు వైపులా జ్వాలలు ఎగసినప్పటికీ మహానాగుడు రవ్వంత కూడా చలించలేదు. అలాగే విగ్రహంలా కూర్చుండిపోయాడు. అతని దేహానికి ఏ అపాయమూ జరుగలేదని ఐతిహ్యము.

చిత్తాన్ని శమింపజేసే ప్రక్రియలకు (enstatic practices) సమానాంతరంగా మరో ధ్యాన ప్రక్రియ ఉన్నది. అనుపశ్యన పద్ధతి (observational analysis). బౌద్ధ శాస్త్రకారులు ఈ పద్ధతికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. కాయానుపశ్యన, వేదనానుపశ్యన, చిత్తానుపశ్యన, ధర్మానుపశ్యన మొదలగునవి ఈ కోవలోకి వస్తాయి. ఆర్యసత్యాల భావన కూడా ఇందులోనే చేరుతుంది. ప్రతిపక్ష భావనలు (antidote techniques) కూడా ఉన్నాయి. శాంతిదేవుడు దీనిని ఎక్కువ చెప్పాడు. దృఢాధ్యాశయ పరిపృచ్ఛాసూత్రం నుండి ఒక ఉదాహరణ : భిక్షువులు, భిక్షిణులు, ఉపాసకులు, ఉపాసికలు-ఈ వర్గం మొత్తాన్ని కలిపి పర్షద్ (assembly) అంటారు. పర్షదం పట్ల భక్తి గౌరవాలున్న మాయావి (magician) ఒకడు ఒకనాడు వాళ్ళకు మాయాకార నాటకాన్ని (magical show) ప్రదర్శించాడు. ఆ మాయాకార నాటకంలో ఒక సుందరాంగి కనిపిస్తుంది. పర్షచ్ఛారాద్యభయం (సభాకంపం = fear in front of

* తమిళంలో ఒక సామెత "ముత్తయ్యా జంబం వెళక్కెణ్ణ కేడు" "ముత్తయ్య జంబం (దంభం) ఆముదానికి నష్టం" తామ్రపర్ణినదీ తీరంలోని ఒక గ్రామం ముత్తయ్యది పేదవాడు కానీ జంబం ఎక్కువ అన్నం తిన్నాక విస్తరి మీద బాగా ఆముదం తడివి బైట పారవేసేవాడు ముద్దముద్దకు నెయ్యి పోసుకొని కలిపి తినేవాడని ఆ ఎంగిలాకును చూసేవాళ్ళనుకోవాలని అతని దుద్గ కాలాంతరంలో ముత్తయ్య ఒక ఆశ్రమంలో చేరాడు. అయినా జంబం వదల్లేదు ఆశ్రమంలో చేరాక అతనికి జందెం వేశారు చొక్కా లోపల ఉన్న జందెం పైకి కనిపించేలా మెడ దగ్గరకి లాగి ఉంచుకొనేవాడు.

assembly, stage fear)) ఉన్న ఒక భిక్షువు ఆ పర్షదంలో కూర్చొనియున్నాడు. మాయానిర్మిత సుందరాంగిని చూడగానే అతని చిత్తం రాగరంజితమయిపోయింది. చిత్తంలోని ఈ రాగరంజిత్వం ముఖం మీదికి ప్రసరిస్తే దానిని ఇతరులు చూస్తే నగుబాటు కదా అని అతను భయపడి తటాలున లేచి బయటకు వచ్చి ఒక తిన్నె మీద కూర్చొని మాయాకార సుందరాంగి మీద రాగాన్ని తగ్గించుకోవడం కోసం "ఏముంది ఆ సుందరాంగిలో? ఒట్టి అశుచిప్రతిమ, అనిత్యతాప్రతిమ, దుఃఖతాప్రతిమ, శూన్యతాప్రతిమ, అనాత్మతాప్రతిమ" అని ప్రతిపక్షభావన చేసుకొన్నాడు.

మరో ప్రక్రియ కూడా ఉన్నది. దీనికి తంత్రం అని పేరు (తంత్రం = a technique for magically storming the gates of Buddhahood). ఈ ప్రక్రియ కేవలం గురువుల సన్నిధిలో ఉండి వాళ్ళ పర్యవేక్షణలో నేర్చుకొనవలసినట్టి mystic technique. దీన్ని నేర్పగలిగినవాళ్ళు ప్రస్తుతం టిబెటన్ లామాలు మాత్రమే.

సంగ్రహంగా చెప్పాలంటే బౌద్ధ ధ్యానప్రక్రియలన్నీ కూడా చిత్తంలో ఒక మంచి మార్పు తీసుకరావడం కోసం ఉద్దేశింపబడినట్టివి (consciousness-altering techniques). ఈ గుణం మొత్తం బౌద్ధ సాహిత్యంలోనూ ఉంది. ప్రసిద్ధ బౌద్ధ ఆచార్యుల శాస్త్ర గ్రంధాలన్నీ కూడా ధ్యాన గ్రంధాలుగానే తీసుకోవచ్చు. speculative philosophies కి, blind theologies కి బౌద్ధంలో స్థానం లేదు. పనిలేని మంగలి పిల్లి తల గొరిగినట్లు పనీ పాట లేని కొందరు బౌద్ధంలో కూడా pluralism, dualism, monism వగైరా వెదుకుతుంటారు.

శాంతిదేవుడు ఆనాపానసతిని గురించి చెప్పకపోయినా ఆనాపానసతి మీద, పలిబోధల మీద (impediments) వ్యాసాన్ని అనుబంధంలో చేర్చాను. ధ్యాన ప్రక్రియలను విస్తారంగా వివరించిన బుద్ధఘోషుని విశుద్ధిమగ్గ ఆధారంతో అవి వ్రాయబడినవి.

# ధ్యాన పారమిత

*(Perfection of Meditative Absorption)*

**కాయచిత్తవివేకేన విక్షేపస్య న సంభవః**
**తస్మాల్లోకం పరిత్యజ్య వితర్కాన్ పరివర్జయేత్**

వివేకం (solitude) ఉంటే విక్షేపాలు (distractions) కలుగవు. దేహానికీ వివేకం (solitude) అవసరం. చిత్తానికీ వివేకం అవసరం. కనుక సాధ్యమైన మేరకు జనసంపర్కానికి దూరంగా ఉంటూ కాయవివేకం; వితర్క హేతువులకు (causes of mental distractions) దూరంగా ఉంటూ చిత్త వివేకం కలిగించుకొనవలెను.

బౌద్ధ గ్రంధాల్లో ఒక విచిత్రం ఏమిటంటే దాదాపు అన్నీ, భిక్షువుల చేత భిక్షువుల కోసం చెప్పబడినవైనప్పటికీ జనసామాన్యానికి చక్కగా పనికివచ్చే అంశాలు వాటిలో పుష్కలంగా ఉండడం! భిక్షువులది కూడా community life (సంఘం) కనుక ఆ community life సాఫీగా నడవడానికి పరస్పర సంబంధ విషయాలు (relationship/ interaction) చాలా చెప్పారు. అవి మనకూ పనికి వస్తున్నాయి ఈ శ్లోకంలో కాయవివేకం అనే పదానికి ఏకాంతవాసం (absolute isolation) అనే అర్థం చెప్పుకొంటే ఆచరణకు అసాధ్యమైనదాన్ని చెప్పినట్లవుతుంది. ఏకాంతవాసం ఎవరో ఒకరిద్దరు 'మిలారేపా' లాంటి యోగులకు మాత్రమే సాధ్యం. మిలారేపా టిబెటన్ యోగులలో చాలా ప్రసిద్ధుడు. మార్పా యోగి శిష్యుడు. సాధన దశలో ఆయన చాలా ఏండ్లు ఒక గుహలో నివసించాడు. జనావాసాలకు అది చాలా దూరం. మనిషి ముఖం కనబడాలంటే నాలుగు గంటలు నడిస్తే గానీ వీలుపడదు. అంతటి నిర్జన ప్రదేశం!

"మనం సంపాయించిన ధనం మిలారేపా వద్ద ఉన్న ధనంతో పోల్చుకొంటే చిల్లిగవ్వ పాటి విలువ చేయదు" అని ఒక ధనికుడు మరో ధనికునితో అంటుంటే ఆ మాటలు ఒక దొంగ విన్నాడు. ఆ రాత్రే మిలారేపా నివాసానికి బయలుదేరాడు. అది పండు వెన్నెల రాత్రి. దారి బాగా కనిపిస్తున్నది. చేతి సంచి చాలదని భావించి అతను గోనె సంచిని పట్టుకొని వెళ్తున్నాడు. సరిగ్గా అర్ధరాత్రి సమయానికి గుహ చేరాడు. ఆ గుహకు తలుపులు ద్వారబంధం ఏమీ లేదు. వెన్నెల వెలుగు లోనికి ప్రసరిస్తున్నది. ఆ దొంగ మెల్లగా పిల్లిలాగా నిశ్శబ్దంగా లోనికి దూరి అటు ఇటు పరకాయించి చూశాడు. ఒక మూల చింకి చాప మీద పడుకొని నిద్రిస్తున్న మిలారేపాకు మెలకువ వచ్చి కన్నులు తెరవగానే అతణ్ణి, అతని వాలకాన్ని, ఆ గోనెసంచిని చూశాడు. అతను ఎవరు? ఎందుకు వచ్చాడు? మిలారేపాకు అర్థమైపోయింది. మిలారేపా ఇరవై ఏండ్లుగా ఒక చిన్న నవ్వుకూడా నవ్వింది లేదు. ఆ ఇరవై ఏండ్ల మొత్తం నవ్వు ఒక్కసారిగా తన్నుకొని వచ్చేసింది. ఆ నవ్వు దేహాన్నంతా ఊపివేస్తుంటే తట్టుకోలేక అయ్యో అమ్మా అంటూ పడీపడీ నవ్వుతూనే ఉన్నాడు. దొంగ చాలా confuse అయిపోయాడు. "ఈ పిచ్చోడు తెల్లారేదాకా నవ్వేట్లున్నాడు" అనుకొని అట్లే నిలబడ్డాడు. ఆ దొంగకు చెప్పలేనంత సిగ్గుగానూ ఉంది. దీపాలు పెట్టేవేళ అనగా గోనెసంచి భుజాన వేసుకొని చాలా ఆశగా బయలుదేరి ఇంత దూరం వస్తే కనిపించిందేమిటి? ఒక్కలోటా చెంబు కూడా లేని శూన్య (empty) గుహ! "ఆ దున్నపోతు వెధవల మాటలు విని miss... అయ్యాను. ఇది ఎవరికైనా తెలిస్తే ఎంత సిగ్గుచేటు!" అనుకొన్నాడు. [illegible] ఉద్దేశం పెట్టుకొని ఆ గోనెసంచితో వచ్చాడో మిలారేపా పసిగట్టినందుకే ఆపుకోలేనంతగా ఆ నవ్వు నవ్వుతున్నాడని ఆ మూర్ఖుడు తెలుసుకోలేకపోయాడు తెలిస్తే మరింత సిగ్గుతో కుంచించుకు పోయేవాడు.

మనం మిలారేపా లాగా స్వతంత్రులంగా (not depending on things [illegible]

company) ఉండలేము. కనుక జనమధ్యంలోనే ఏకాంతం సాధించుకోవాలి.

చిత్తవివేకం (solitude of mind) చాలా అవసరం. చిత్త ఏకాంతతను వితర్కాలు (useless thoughts) భగ్నం చేస్తుంటాయి. మనోజల్పానికి (murmering of mind or chattering of mind) వితర్కం అని పేరు. ఇది చేతనా విశేషమే (move of the will) కనుకనే సంప్రజన్యం (awareness) అనే పనిలో చేతన (will) ఉంటే వితర్కాలు మాయమవుతాయి. ఎందుకంటే చేతన ఏకకాలంలో రెండు పనులు చేయజాలదు. సంప్రజన్యం ఉంటే వితర్కాలుండవు. వితర్కాలున్నప్పుడు సంప్రజన్యం ఉండదు. గోడ మీద బల్లిని చూసినట్లు, ఆకాశంలో మేఘశకలాన్ని చూసినట్లు మనస్సులో కదిలే ఆలోచనలను చూడడం చేయాలి. గోడ మీద బల్లి పురుగు దగ్గరకు ఎలా కదులుతున్నది, లబక్‌మని దాన్ని ఎలా పట్టుకొంటున్నది ఊరక చూస్తాము. ఉదాసీనంగా చూస్తాము. రాగద్వేషాలు వగైరా ఏమీ లేకుండా ఊరక చూస్తాము. అలాగే మేఘశకలాన్నీ. ఉన్నదున్నట్లు చూస్తాము. ఆలోచనలను గమనించే విధానం ఏమిటంటే వాటికి పేర్లు పెట్టకూడదు. 'ఇది రాగము, ఇది ద్వేషము, ఇది అసూయ, ఇది ఈర్ష్య' అని పేర్లు తగిలించరాదు. (naming చేయరాదు). అదిమివేసే ప్రయత్నం (suppression) చేయరాదు. సమర్థించడము (justifying) చేయకూడదు. వ్యాఖ్యానమూ (interpreting) చేయకూడదు. ఉపేక్షించడమూ (ignoring) చేయకూడదు. ఊరక సాక్షి మాత్రంగా గమనిస్తూ ఉంటే సరిపోతుంది. వితర్కాలు మాయమవుతాయి. మనస్సుకు చల్లదనం చేకూరుతుంది. worthless, useless, fruitless thoughts విషయంగానే ఇది. మనస్సు అనే పరికరాన్ని మనం fruitful activities లో నిమగ్నం చేసినపుడు ఈ గమనికలు అక్కర్లేదు. చిన్న వయస్సులో optimism (ఆశావాదం), పెద్ద వయస్సులో pessimism (నిరాశావాదం) సహజమే కదా! చిన్న వయస్సులో మనస్సు ఔద్ధత్యంగా (susceptible to temptation) ఉంటుంది. పెద్ద వయస్సులో మనస్సు కౌకృత్యంగా (brooding over past foolish deeds = regrets, remorseness) ఉంటుంది. చిన్న

వయస్సులో మనస్సు భవిష్యత్తుకు పరుగు దీస్తుంది. పెద్ద వయస్సులో nostalgia తో గతానికి పరుగులు తీస్తుంది. గతమూ భవిష్యత్తూ రెండూ అభావములే (non-existents). వర్తమానమే భావం (existent). మనస్సును భావం (present) మీదనే పెట్టుంటే వితర్కాలుండవు. విక్షేప హేతువులు (causes for distraction) చాలా ఉన్నాయి. ట్రాన్సిస్టర్ పక్కన ఉంటే తిప్పాలనిపిస్తుంది, టీవీ ఎదుట ఉంటే చూడాలనిపిస్తుంది. ఎవరికి వారు వితర్క హేతువులు ఏమిటో గమనించుకొని దూరం చేసుకొంటే చిత్తానికి ఏకాంతం లభిస్తుంది.

పృధక్ జనులకు దూరంగా ఉండటం మంచిది-వాళ్ళు ఏ వేషంలో ఉన్నా సరే. పృధక్ జనులను కనిపెట్టి దూరంగా ఉండడానికి పృథక్జన ధర్మాలు కొన్ని :

**ఈర్ష్యోత్కృష్టాత్సమాద్ద్వంద్వో హీనాన్మానః స్తుతేర్మదః**
**అవర్ణాత్ప్రతిఘశ్చేతి కదా బాలాద్ధితం భవేత్**

తన కన్నా ఉన్నతుడుగా ఉన్నవాణ్ణి చూస్తే పృధక్ జనుడికి ఈర్ష్యగా ఉంటుంది. సమానుడిపట్ల పోటీ భావం కలుగుతుంది. తన కన్నా క్రింది స్థాయిలో ఉన్నవాణ్ణి చూస్తే మానం (pride) కలుగుతుంది. పొగిడితే మదం (intoxication) కలుగుతుంది. తెగడితే ద్వేషం కలుగుతుంది. ఇటువంటి పృధక్ జనుల సహవాసం వల్ల మనకు కలిగే హితం ఏముంది?

(పృధక్ జనుడు స్వంత ఆలోచన లేనివాడు. చిన్నప్పటి నుండి నానా రకాల programming కి అతని software (brain) గురియైయున్నది. భావాల programming కూడా జరిగియున్నది. ఆ భావాలు రిక్తముష్టి (empty fisted) భావాలు గానూ ఉండవచ్చు. పొరబాటున వాటిని అతని ముందు తప్పుబట్టామో అతని ద్వేషాన్ని రుచి చూడాల్సి ఉంటుంది. (దూషణ పర్వం)

**ధర్మార్థమాత్రమాదాయ భృంగవత్ కుసుమాన్మధు**
**అపూర్వ ఇవ సర్వత్ర విహరిష్యామ్యసంస్తుతః**

శరీరధారణకు కావలసినంత మేరకు తుమ్మెదలాగా తీసుకొంటూ అన్నిచోట్ల అపూర్వుడుగా (stranger) చరిస్తాను. ఎవరితోనూ సంస్తవాన్ని (intimacy) పెట్టుకోను.

**స్వచ్ఛందచార్యనిలయః ప్రతిబద్ధో న కస్యచిత్**
**యత్సంతోషసుఖం భుంక్తే తదింద్రస్యాపి దుర్లభమ్**

తన జీవిత పగ్గాలు తన చేతిలోనే ఉంచుకొని స్వతంత్రాన్ని అనుభవించే వాడు పొందే సంతోషసుఖం ఇంద్రుడికి కూడా లేదు.

శాంతిదేవుడు అశుభ చింతన (contemplation on loathsome things) చాలా చేశాడు. చివర పరాత్మసమతాభావన (equality of oneself with another), పరాత్మపరివర్తన (exchanging one self with another) అనే రెండు భావనా ప్రక్రియలను చెప్పాడు. దీన్ని ఇంగ్లీషులో empathy* అనవచ్చు. ఈ రెండు భావనలను స్పష్టంగా చూడదలస్తే ఏ పసిబిడ్డ తల్లినైనా చూడవచ్చు.

చిత్త కర్కశత్వానికి (callousness) ఈ రెండు భావనలు ఔషధంగా పనిచేస్తుంది.

**యే కేచిద్దుఃఖితా లోకే సర్వే తే స్వసుఖేచ్ఛయా**
**యే కేచిత్సుఖితా లోకే సర్వే తే ఽన్యసుఖేచ్ఛయా**

తన సుఖమే కోరేవాడు దుఃఖం పాలవుతాడు. ఇతరుల సుఖం కోరేవాడు తన సుఖాన్ని పొందుతాడు.

---

* *empathy = the ability to identify oneself mentally with a person and so understand his or her feelings*

# పరిణామన

*(Transfer of Merit)*

పరిచయు వాక్యాలు

వజ్రం లాగా చాలా గట్టిగా ఉన్నట్టి సత్కాయదృష్టిని (individuality view) ఏదో విధంగా ఛేదించే ప్రయత్నమే మొత్తం బౌద్ధం. పరిణామనం పని కూడా అదే. అధ్యాత్మ జీవితానికే పూర్తిగా అంకితమైనవాడికి ఇతరులకు దానంగా ఇవ్వదగిన ఆమిష వస్తువులు (material things) లేకపోవచ్చు. కానీ అతని వల్ల ఇతరులకు ఎంతో కొంత ధర్మదానం (gift of teachings) జరుగుతుంది. ఇంకా ఇతరమైన మంచి పనులు కొన్ని జరుగుతుంటాయి. ఇవి పుణ్యాన్ని కలిగించేవి. ఆ పుణ్యం కూడా తనకక్కర లేదు, దాని వల్ల వచ్చే సుఖం, మేలు ఏమైనా ఉంటే అది సర్వసత్త్వులకు చెందనీ అని పరిణామనం (transfer) చేయడం బోధిసత్త్వుల పద్ధతి. ఇక్కడొక రహస్యం ఉంది. పుణ్య పరిణామనం చేసేవాడికి తరిగిపోయేది ఏమీ లేదు. ఇంకా ఎక్కువగా పుణ్యం వృద్ధి అవుతుంది. బుద్ధత్వానికి పుణ్య సంభారమూ కావాలి, జ్ఞాన సంభారమూ కావాలి. కనుక బోధిసత్త్వుడు ఈ రెండు సంభారాల సముపార్జనలోనే చిత్తాన్ని లగ్నం చేస్తాడు. తథాగత చైత్యానికి లేదా విగ్రహానికి పుష్పం గానీ ధూపం గానీ గంధం గానీ సమర్పించేటప్పుడు బోధిసత్త్వుడు ఏమనుకొంటాడంటే : "ఈ పుణ్యం, సకల జీవుల దౌశ్శీల్య దుర్గంధాన్ని తొలగించేందుకు వినియోగమగును గాక! ... ఇలా పరిణామనం చేసుకొంటూనే చేయవలసిన పనులు చేస్తుంటాడు.

# పరిణామన

*(Transferıng Dedicatıng the Merıts)*

బోధిచర్యావతారాన్ని చింతన చేసినందువల్ల నాకు కలిగిన శుభం (merit) ద్వారా సకల జీవులు బోధిచర్యం అనే ఆభరణం కలిగినవారగుదురు గాక!

దైహికమైన మానసికమైన బాధలచే తపిస్తున్న జనులు నా ఈ పుణ్యం వల్ల సుఖితులగుదురు గాక!

చలిబాధతో వణుకుతున్నవాళ్ళు వెచ్చదనాన్ని, ఉష్ణబాధను అనుభవిస్తున్నవాళ్ళు చల్లదనాన్ని పొందుదురుగాక!

నరకలోక దుఃఖితులు సుఖావతీవ్యూహ సుఖాన్ని పొందుదురుగాక! భూత ప్రేత పిశాచాదులు కూడా సుఖమ నొందుదురు గాక!

అన్యోన్య భక్షణ భయాన్నుండి తిర్యక్కులు విముక్తి పొందును గాక! గ్రుడ్డివాళ్ళు చూపును పొందుదురు గాక! గర్భిణీ స్త్రీలు మాయాదేవి లాగా సుఖప్రసవలగుదురు గాక! ప్రజలకు వస్త్ర భోజన పానీయాదులు తగినంత లభించును గాక! భయభీతులు నిర్భయులగుదురు గాక! శోకార్తులు ప్రీతి సుఖమును పొందుదురు గాక! ఉద్విగ్నులు (worried) ధైర్యవంతులగుదురు గాక! బంధితులు విముక్తులగుదురు గాక! దుర్బలులు బలము కలిగినవారలగుదురు గాక! ప్రజలు పరస్పర స్నేహచిత్తులగుదురు గాక! ప్రయాణికులకు ప్రయాణం సుఖంగా జరుగుగాక! ఏ కార్యార్థమై ప్రయాణం చేస్తున్నారో అది నెరవేరుగాక! సముద్ర ప్రయాణికులు క్షేమంగా తీరం చేరి భార్యాబిడ్డలతో ఆనందించుదురు గాక! అడవిలో ప్రయాణిస్తున్నవారలు చోరబాధ వ్యాఘ్రభయం లేకుండా

పయనించుదురు గాక! సుప్తులు (sleeping), మత్తులు, ప్రమత్తులయిన జనులకు ఏ అపాయం కలుగకుండా దేవతల రక్షణ ఉండుగాక! ప్రజలు అష్ట అక్షణ (eight unfavourable conditions) వినిర్ముక్తులై శ్రద్ధ, కృప, ప్రజ్ఞ, ఆకార సంపత్తి, ఆచార సంపత్తి కలిగి జాతిస్మరులుగా (పూర్వ జన్మలను జ్ఞప్తికి తెచ్చుకొన్నవారుగా) వికసించుదురు గాక! నిరుత్సాహవంతులు ఉత్సాహవంతులగుదురు గాక! విరూపులు రూపసంపన్నులగుదురు గాక! క్రింది స్థాయిలో ఉన్న ప్రజలు ఉన్నతస్థాయిని పొందుదురు గాక! నా పుణ్య బలం వల్ల ప్రజలు అకుశల కర్మలను వీడి కుశల కర్మ పరాయణులగుదురు గాక! అందరూ బుద్ధుని అనుగ్రహం పొంది బోధిచిత్తదీక్షితులై మారుని జయించువారలగుదురు గాక! అన్ని దిక్కులలో రమ్యమైన ఉద్యానవనములు వెలయును గాక! అన్ని చోట్ల మనోహరమైన ధర్మధ్వని ఘోషలు వినిపించును గాక! వర్షములు `సకాలములో కురియును గాక! సస్యసంపద పుష్కలముగా పండును గాక! ప్రజలు సంపన్నులగుదురు గాక! పాలకులు ధర్మనిరతులగుదురు గాక! ఔషధములు శక్తివంతములుగా ఉండును గాక! జపనిష్ఠులకు వారి మంత్రములు సిద్ధించును గాక! డాకినీ మున్నగు దుష్టశక్తులు కరుణాపూర్ణులగును గాక! అవమానితులుగా, దుఃఖితులుగా, రోగులుగా పాపులుగా ఎవ్వరూ ఉండకుందురు గాక! విహారములు సుస్థితములుగా ఉంటూ సూత్ర పాఠాలకు నిలయములగును గాక! భిక్షువులందరూ శిక్షాకాములై (great liking for discipline) అభివృద్ధి చెందుదురు గాక! దుశ్శీలురు పశ్చాత్తాపం చెంది పాపక్షయరతులగుదురు గాక! పండితులు గౌరవాన్ని పొందుతూ లోటు లేని వారగుదురు గాక! ఈ జన్మలోనే ప్రజలు బుద్ధత్వాన్ని పొందువారగుదురు గాక! శ్రావకులు, ప్రత్యేకబుద్ధులు, బోధిసత్త్వులు వీరందరి ఆశయములు నెరవేరుగాక! జాతిస్మరత్వాన్ని, ప్రవ్రజ్యను, ఏకాంతవాసాన్ని నేను ప్రతి జన్మలోనూ మంజుఘోషుని అనుగ్రహం వల్ల పొందువాడనగుదును గాక! నేను దర్శించదలచినపుడు, భాషింపదలచినపుడు నా నాధుడు (protector)

మంజుఘోషుడు నాకు సాక్షాత్కరించును గాక! నా నాధుడు మంజుఘోషుడు ఎలా జనహితం కోసం అంకితమైనాడో నేనూ అలాగే అగుదును గాక!

**జగద్దుఃఖైకభైషజ్యం సర్వసంపత్సుఖాకరమ్**
**లాభసత్కారసహితం చిరం తిష్ఠతు శాసనమ్**

జగత్ దుఃఖానికి ఏకైక ఔషధం, సకల సంపదలకు నిలయం, సత్కారార్హం అయిన శాస్త్రం (teachings of Buddha) చిరకాలం నిలిచి ఉండుగాక!

**మంజుఘోషం నమస్యామి యత్ప్రసాదాన్మతిః శుభే**
**కల్యాణమిత్రం వందే ఽహం యత్ప్రసాదాచ్చ వర్ధతే**

ఎవని అనుగ్రహం వల్ల నా మనస్సు శుభానికి మళ్ళినదో అట్టి మంజుఘోషునికి నమస్కరిస్తున్నాను. నా శుభ సంకల్పాలను వర్ధిల్లజేసిన నా కల్యాణ మిత్రునికి (spiritual friend) నమస్కరిస్తున్నాను.



# సదాప్రరుదితుడు

*(Ever Weeping)*

పరిచయ వాక్యాలు

బౌద్ధం, జైనం రెండూ సమకాలీన ఉద్యమాలు. మొదటిది ప్రపంచ వ్యాప్తం అయ్యింది. రెండవది జన్మస్థానం ఎల్లలు దాటలేదు కానీ ఒక విషయంలో మాత్రం మొదటిదానికన్నా ఎక్కువ శక్తిని చూపించింది. కొద్దిపాటి సంఖ్యాబలంతోనైనా జన్మభూమిలో నిలదొక్కుకోవడంతోబాటు గ్రంధరక్షణలో జైనం తన శక్తిని చూపించింది. చక్రవర్తుల పాలన క్రిందనే బౌద్ధం మనగలుగుతుంది. పాళెగాండ్ర పాలన బౌద్ధానికి అనుకూలం కాదు. పాళెగాండ్రుల్లో అహంకారం ఎక్కువగా ఉంటుంది. బౌద్ధం అహంకారం తగ్గించుకోమంటుంది. దేశం, పాళెగాండ్ర (చోటా రాజుల) వశం కావడంతో బౌద్ధానికి యమఘంట మ్రోగడం మొదలయ్యింది. బౌద్ధ విహారాలన్నీ మహాపధముల (highways) సమీపంగా ఉండడంతో విదేశీయుల దండయాత్రలకు easy target అయి అన్నీ బూడిద కావడంతో మెరుపు మెరిసినంత వేగంతో బౌద్ధం దేశంలో అంతరించిందని చెప్పవచ్చు. జైనులు అంత ఆర్భాటానికి పోలేదు. మారుమూల ప్రదేశాల్లో ప్రజల్లో వేర్లూనుకొన్నారు. అరలోఅర మరలోమర అన్నట్లుగా భూగర్భ గ్రంధాలయాల్లో గ్రంధాలను కాపాడుకొన్నారు.

"సత్యమేవ జయతే" అన్న సూక్తి యధార్ధం. విహారాలు, చైత్యాలు, స్తూపాలు విగ్రహాలు నాశనం అయినా ఆర్యసత్యాలు నాశనం కాలేదు. ఇప్పటికీ ఎప్పటికీ ఉంటాయి.

మహాయాన సూత్ర గ్రంథాలు కొన్ని ముఖ్యమైనవి మూల భాషలో ఇప్పటికీ లభిస్తున్నాయి. గ్రంథాలను చదువలేకపోయినా పూజామందిరాల్లో పూజాపీఠం మీద ఉంచి పూజ చేయడం అనే ఆచారం వల్ల కొన్ని నిలిచాయి. అందులో అష్ట సాహస్రిక ప్రజ్ఞాపారమిత ఒకటి. సదాప్రరుదితుని వృత్తాంతం ఇతర సూత్ర గ్రంథాల్లోనూ ఉండినా ఇక్కడ ప్రజ్ఞాపారమిత గ్రంథంలోని వృత్తాంతమే సంక్షిప్తం చేయబడింది. అధ్యాత్మ అన్వేషకుడు దేనికైనా సిద్ధపడే సాహసికుడుగా ఉండాలనే ఆదర్శాన్ని ఈ ఇతివృత్తం తెలుపుతుంది. ఇది పూర్తిగా symbolic మొదట్నుంచి చివరిదాక కథ ఈ భూమి మీద నడవదు. మహాద్భుతమైన స్వాప్నిక జగత్తులో కథ నడిచిన విధంగా ఉంటుంది. consciousness కి జాగ్రత్ స్వప్న అవస్థల్లో వ్యత్యాసం లేదు. అది ఏ అవస్థలో ఉంటే అదే అప్పటికి వాస్తవం. కథలోని అద్భుతం చాలా వరకు ఈ సంక్షిప్తీకరణంలో చోటు చేసుకోలేదు. భాష వల్ల మనస్సులో ఏర్పడిన సంకెళ్ళను (conditionings) భాష ద్వారానే ఛేదించే పని మహాయాన సూత్ర గ్రంథాలు చేస్తుంది. మన జాగ్రఫీ, హిస్టరీ అన్నీ అక్కడ తారుమారవుతాయి చిత్తాన్ని దివ్యలోకాల్లోనే త్రిప్పుతుంది.

ప్రజ్ఞాపారమిత సూత్రాల అధ్యయనంలో విశేషకృషి గావించిన Edward Conze గారి ఇంగ్లీషు అనువాద సహాయంతో ఈ సంక్షిప్తీకరణం జరిగింది. ఈ రచనలోని ఇంగ్లీషు వాక్యాలన్నీ Edward Conze గారివే.

# సదాప్రరుదితుడు

*(Ever Weeping)*

బోధిసత్త్వుడైన సదాప్రరుదితుడు ప్రజ్ఞాపారమితను (perfection of wisdom) పర్యేషించదలచినవాడై (to search), బ్రహ్మచర్యం (holy life) చరించాడు. లాభ (gain), సత్కార (honour), శ్లోకములను (fame=కీర్తి) అతను వాంఛించలేదు. అరణ్యంలో ఏకాంతవాసం చేస్తున్న అతనికి ఒకనాడు అంతరిక్షం నుండి దివ్య వాక్కులు వినిపించింది.

"కులపుత్రా (son of a good family), నీవు తూర్పు దిక్కుగా వెళ్ళుము. అక్కడ ప్రజ్ఞాపారమితను వినగలవు. నీ ప్రయాణంలో శరీర ఆయాసాన్ని లెక్కబెట్టవద్దు. స్త్యానమిద్ధములకు (sloth and torpor) వశం కావద్దు. అన్నపానీయాల విషయమై ఆలోచనలు వద్దు. ముందుగానే ప్రణాళికలు (making definite plans) వేసుకొని ప్రయాణించకు. దశ దిశల్లో ఎన్నో వింతలు విచిత్రాలు జరుగుతూనే ఉంటాయి. నీ ప్రయాణంలో వాటిపట్ల కుతూహలాలు చూపకుండా ప్రయాణించుము. సత్కాయదృష్టి (individuality view) అనే పెనుభారంతో ప్రయాణించకు. ఆ పెనుభారం వల్ల బుద్ధ ధర్మాలకు దూరమవుతావు. బుద్ధ ధర్మాలకు దూరమైతే సంసార చక్రంలోనే తిరుగుతూ ఉంటావు. సంసారంలో తిరిగేవాడు ప్రజ్ఞాపారమిత కోసం ప్రయాణం చేయలేడు."

అంతరిక్షం నుండి వెలువడిన దివ్య వాక్కులను ఆలకించిన సదాప్రరుదితుడు ప్రతివచనంగా "భీష్మగర్జిత నిర్ఘోషస్వరమా, నీవు ఆదేశించిన విధంగానే నడుచుకొంటాను. ఎందుకంటే నేను సమస్త జీవులకు వెలుగునివ్వగల శక్తిని



సంపాయించదలచాను. బుద్ధ ధర్మాలు నా స్వంతమైనప్పుడే నాకు ఆ శక్తి కలుగుతుంది." అన్నాడు. "సాధు సాధు" (well spoken, well spoken) అని ఆ దివ్య స్వరం సదాప్రరుదితుణ్ణి మెచ్చుకొనింది.

సదాప్రరుదితుడు తూర్పు దిక్కుగా ప్రయాణించాడు. కొంతదూరం ప్రయాణించాక "ఎంత దూరం నేను ప్రయాణించాలో ఆ దివ్య స్వరాన్ని అడిగి తెలుసుకొనకుండా బయలుదేరితిని గదా" అనుకొని అక్కడే ఆగాడు. 'నేనెప్పుడు ప్రజ్ఞాపారమితను వినగలను"? అనే వ్యాకుల చిత్తంతో తపించిపోయాడు. ఉన్న ఒక్కగానొక్క పుత్రకుడు హఠాత్తుగా మరణిస్తే తండ్రియైనవాడు ఎలా విలపిస్తాడో అలా సదాప్రరుదితుడు ప్రజ్ఞాపారమితకోసం రోదించాడు, ఆక్రందించాడు, శోకించాడు, పరిదేవమానుడయ్యాడు (lamented).

"ప్రజ్ఞాపారమితను ఎప్పుడు వినగలను?" అని పరితపిస్తున్న సదాప్రరుదితునికి తథాగత విగ్రహం సాక్షాత్కరించి "సాధు సాధు కులపుత్రా, పూర్వకాలీన బోధిసత్త్వులు కూడా నీలాగే ప్రజ్ఞాపారమితను అన్వేషించారు. ఇదే వీర్యంతో ఉత్సాహంతో ముందుకు పొమ్ము. ఇక్కడికి సరిగ్గా ఐదు వందల యోజనాల దూరంలో గంధవతి అనే మహానగరం ఉన్నది. ఆ నగరం మధ్యలో నిత్యప్రముదితం, అశోకం, శోకవిగతం, పుష్పచిత్రం అనే పేర్లు కలిగిన నాలుగు ఉద్యానవనములున్నాయి. ఆ ఉద్యానవనముల మధ్య ఒక మహాభవనమున్నది. ఆ భవనములో బోధిసత్త్వ ధర్మోద్గతుడు నివసిస్తున్నాడు. ఆయన ఆ నగరవాసులకు ప్రజ్ఞాపారమితను ఉపదేశిస్తుంటాడు. నగరం మధ్యలో ఆయన కోసం ప్రత్యేకంగా ఆ నగరవాసులు బహుసుందరమైన ఆసనాన్ని (pulpit) నిర్మించారు. ఆ ఆసనం మీద ఉపవిష్టుడై ధర్మోద్గతుడు ప్రజ్ఞాపారమితను నగరవాసులకు ఉపదేశిస్తుంటాడు. నగరవాసులు ధర్మం పట్ల అమిత గౌరవంతో, శ్రద్ధతో ఆ ఉపదేశాన్ని వింటారు. వందలు వేలు లక్షల మంది దేవతలు కూడా అక్కడికి వచ్చి చేరుతారు. ఆ ఉపదేశాన్ని ఆలకించిన వారికి ఇక తిరోగమనం అనే దుస్థితి ఉండదు. నీవు ఆయన వద్దకు వెళ్ళుము."

తథాగత విగ్రహం పలికిన వాక్యాలు విని సదాప్రరుదితుడు తుష్టి చెందాడు. (contented). ఉదగ్రుడయ్యాడు (elated). ఆత్తమనస్కుడయ్యాడు (Joyful). ప్రముదితుడయ్యాడు (over joyed). ప్రీతిసౌమనస్యజాతుడయ్యాడు (Jubilant). విషదిగ్ధమైన శల్యం (poisoned arrow) తగిలిన వ్యక్తి ఎలా అన్యమైన చింతలన్నీ మానివేసి "ఈ విషశల్యం నుండి నన్ను కాపాడే వైద్యుణ్ణి అతి త్వరగా పొందాలి" అనే తత్పరత కలిగియుంటాడో అలాగే సదాప్రరుదితుడు కూడా "ఎప్పుడు నేను ధర్మోద్గతుణ్ణి చూడగలను, మనస్సును పూర్తిగా విముక్తం చేసేటువంటి ప్రజ్ఞాపారమితను వినగలను" అని పరమ ఉత్కంఠభరితుడయ్యాడు. ఆ పృథివీ ప్రదేశంలోనే నిలిచియున్న సదాప్రరుదితునికి గంధవతీ నగరంలో ధర్మోద్గతుడు ఉపదేశిస్తున్న ప్రజ్ఞాపారమిత సందేశం వినిపించింది. ఆ ఉపదేశాన్ని వింటుంటే అతనికి అనేక సమాధిముఖములు (doors to concentration) అభిముఖమైనాయి. అవి ఏవనగా :

1. **సర్వధర్మస్వభావవ్యవలోకనో నామ సమాధిః**

   It surveys the own-being of all dharmas

2. **సర్వధర్మస్వభావానుపలబ్ధిర్నామ సమాధిః**

   non-apprehension of own-being of all dharmas

3. **సర్వధర్మస్వభావజ్ఞాననిర్గమో నామ సమాధిః**

   entrance to the cognition of the own-being of all dharmas

4. **సర్వధర్మనిర్నానాత్వో నామ సమాధిః**

   non-difference of all dharmas

5. **సర్వధర్మనిర్వికారదర్శీ నామ సమాధిః**

   spectator of the unchangeability of all dharmas

6. సర్వధర్మావభాసకరో నామ సమాధిః

illuminator of all dharmas

7. సర్వధర్మతమోఽపగతో నామ సమాధిః

from all dharmas darkness has vanished

8. సర్వధర్మజ్ఞానవిధ్వంసనో నామ సమాధిః

It shatters the cognition of all dharmas

9. సర్వధర్మవిధూననో నామ సమాధిః

it tosses all dharmas about

10. సర్వధర్మానుపలబ్ధిర్నామ సమాధిః

non-apprehension of all dharmas

11. కుసుమాభికీర్ణో నామ సమాధిః

bedecked with flowers

12. సర్వధర్మాత్మభావాభినిర్హారో నామ సమాధిః

with in it's body it consummates all dharmas

13. మాయావివర్జితో నామ సమాధిః

having abandoned illusion

14. ఆదర్శమండలప్రతిభాసనిర్హారో నామ సమాధిః

calling forth images reflected in a mirror

15. సర్వసత్త్వరుతనిర్హారో నామ సమాధిః

calling forth the sounds of all beings

16. రజోఽపగతో నామ సమాధిః

without any dirt

17. సర్వసత్త్వాభిప్రమోదనో నామ సమాధిః

gladdening all beings

18. సర్వసత్త్వరుతకౌశల్యానుగతో నామ సమాధిః

follower of the vocal sounds of all beings, from skill in means

19. నానారుతపదవ్యంజనాభినిర్హారో నామ సమాధిః

consummation of the whole varieties of letters, words and vocal sounds

20. అస్తంభితో నామ సమాధిః

the state which comes from feeling no regidity

21. ప్రకృత్యవ్యవహారో నామ సమాధిః

inexpressible in it's essential nature

22. అనావరణవిమోక్షప్రాప్తో నామ సమాధిః

attainment of unobstructed emancipation

23. రాజోపగతో నామ సమాధిః

visit from the king

24. నామనిరుక్తిపద్యంజనో నామ సమాధిః

grammatical analysis of speech in to words and letters

25. సర్వధర్మవిపశ్యనో నామ సమాధిః

it has left the sphere of all dharmas behind

26. సర్వధర్మవిషయాపగతో నామ సమాధిః

it has left the sphere of all dharmas behind

27. సర్వధర్మానావరణకోటిర్నామ సమాధిః

unobstructed limit of all dharmas

28. గగనకల్పో నామ సమాధిః
fashioned like the firmament

29. వజ్రోపమో నామ సమాధిః
like a thunderbolt

30. ఆసన్నరూపరాజో నామ సమాధిః
king is near

31. అసపత్నరాజో నామ సమాధిః
unrivalled king

32. జయలబ్ధో నామ సమాధిః
victorious

33. అవివర్త్యచక్షుర్నామ సమాధిః
one cannot avert the eye

34. ధర్మధాతునియతో నామ సమాధిః
fixed on the element of dharma

35. ధర్మధాతునిర్గతో నామ సమాధిః
come out of the element of dharma

36. ఆశ్వాసదాతా నామ సమాధిః
granter of consolation

37. సింహాభిగర్జితో నామ సమాధిః
it has roared like a lion

38. సర్వసత్త్వాభిభవనో నామ సమాధిః
no world for beings to be reborn in

39. విగతరజో నామ సమాధిః

free from dirt

40. అసంక్లిష్టో నామ సమాధిః

undefiled

41. పద్మవ్యూహో నామ సమాధిః

lotus-array

42. కాంక్షోచ్ఛేదనో నామ సమాధిః

annihilation of hesitation

43. సర్వసారానుగతో నామ సమాధిః

follower of all substancial excellence

44. సర్వధర్మాభ్యుద్గతో నామ సమాధిః

elevated above all dharmas

45. అభిజ్ఞాబలవైశారద్యప్రాప్తో నామ సమాధిః

attainment of the super-knowledges, the powers and the grounds of self-confidence

46. సర్వధర్మనిర్వేధకో నామ సమాధిః

piercer of all dharmas

47. సర్వధర్మవిభవముద్రా నామ సమాధిః

seal of the desisting from becoming on the part of all dharmas

48. సర్వధర్మవిభవసముద్రో నామ సమాధిః

ocean in which all dharmas lose their becoming

49. సర్వధర్మనిర్విశేషదర్శీ నామ సమాధిః

spectator of all dharmas without distinction

50. సర్వదృష్టికృతగహనవివర్జితో నామ సమాధిః

it has left behind the jungle of all views and actions

51. తమోఽపగతో నామ సమాధిః

without darkness

52. సర్వధర్మనిమిత్తాపగతో నామ సమాధిః

without a sign of all dharmas

53. సర్వసంగవిముక్తో నామ సమాధిః

freed from all attachment

54. సర్వకౌసీద్యాపగతోనామ సమాధిః

without a trace of laziness

55. గంభీరధర్మప్రభాకరో నామ సమాధిః

it sheds light on deep dharmas

56. మేరుకల్పో నామ సమాధిః

fashioned like Meru

57. అసంహార్యో నామ సమాధిః

irresistible

58. మారమండలవిధ్వంసనకరో నామ సమాధిః

it shatters the circle of Mara's army

59. త్రైలోక్యానభినివిష్టో నామ సమాధిః

no inclination for anything in the triple world

60. రశ్మినిర్హారో నామ సమాధిః

emmission of rays

61. **తథాగతదర్శనో నామ సమాధిః**

sight of the Tathagata

62. **సర్వతథాగతదర్శీ నామ సమాధిః**

spectator of all Tathagatas

ఈ సమాధులందు స్థితుడైన సదాప్రరుదితుణ్ణి దశదిశల్లో ఉన్న అసంఖ్యాక బుద్ధులు సాధుకారం (applauded) చేసి ఇలా అన్నారు : "మేము కూడా పూర్వం నీలాగే ప్రజ్ఞాపారమితను అన్వేషిస్తూ ఈ సమాధులను పొందాము. మా గమ్యాన్ని చేరాము. బుద్ధధర్మాల యందు ప్రతిష్ఠితులమైనాము. సర్వధర్మముల పట్ల అమన్యమానతయే (absence of all self-conceited imaginings) ఈ ప్రజ్ఞాపారమిత. ఈ ప్రజ్ఞాపారమిత వల్లనే మా దేహములు సువర్ణ వర్ణంతో ప్రకాశిస్తున్నాయి. ముప్పై రెండు మహాపురుష లక్షణాలు, ఎనభై అనువ్యంజనాలతో, వ్యామప్రభతో (splendid halo) విరాజిల్లుచున్నాము. అచింత్యమైన (unthinkable), అనుత్తరమైన (supreme) బుద్ధ జ్ఞానాన్ని, బుద్ధ ప్రజ్ఞను, బుద్ధ సమాధిని పొందాము. ఈ గుణపారమితల విషయం శ్రావకులకు ప్రత్యేకబుద్ధులకు గోచరం కాని విషయం. కనుక నీవు ఈ ధర్మాల పట్ల గౌరవాన్ని ఇష్టాన్ని ఉత్సాహాన్ని కలిగియుండుము. కల్యాణమిత్రుని (good friend) పట్ల కూడా ప్రేమ, గౌరవమును కలిగియుండుము. అనుత్తర సమ్యక్ సంబోధిని అచిరకాలంలోనే పొందగలవు."

"నా కల్యాణమిత్రుడెవర్రు?" అని సదాప్రరుదితుడు ప్రశ్నించాడు. సమాధానంగా ఆ దివ్యమూర్తులు ఇలా అన్నారు : "గంధవతీనగరంలోని ధర్మోద్గతుడే నీ కల్యాణ మిత్రుడు. అతని ప్రభావం వల్లనే నీవు ఈ సమాధులను (concentrations) పొందగలిగావు. అతణ్ణి భక్తితో సేవించుము. త్రిసాహస్ర మహాసాహస్ర ధాతువులోని సకల భోగ్యవస్తువులు సమర్పించి అసంఖ్యేయ కల్పాలు అతణ్ణి నీవు సేవించినా నీ ఋణం తీరదు. అతని వల్ల నీవు పొందిన

పొందబోయే ప్రయోజనం అటువంటిది.

సదాప్రరుదితుడు సమాధులనుండి (concentrations) వ్యుత్థితుడై "నాకు గోచరించి తిరిగి అంతర్హితులైన తథాగతులు ఎక్కడ్నుంచి వచ్చారు? ఎక్కడికి వెళ్ళారు? దీనికి సమాధానం ధర్మోద్గతుణ్ణి అడిగి తెలుసుకొంటాను. ఆయన, ధారణీలు (ధారణి = short formulas which enable us to remember the salient points of the doctrine) తెలిసినవాడు. పంచ అభిజ్ఞాసంపన్నుడు. నా కల్యాణ మిత్రుడు. ఆయన్ను తలచుకొంటేనే ఆయన పట్ల నాలో ప్రేమ (affection), ప్రసాదం (confidence), చిత్రీకారం (esteem), గౌరవం (respect) పొంగిపొరలుతూ తనువు పులకరించిపోతున్నది. నేను ఆయన్ను సమీపించి సాష్టాంగ నమస్కారం చేసినపుడు ఇవ్వడానికి నా వద్ద ఏమీ లేదు. అయ్యో, ఎంత దరిద్రుడను! వస్త్రాలు, రత్నాలు, సువర్ణం, మణులు, ముత్యములు, వైడూర్యములు, శంఖశిలలు, ప్రవాళములు, రజతం, పుష్పం, ధూపం, గంధం, మాల్యం, విలేపనం, చూర్ణం, చీవరం, ఛత్రం, ధ్వజం, ఘంట, పతాకం ఏమీ లేనివాడను. నేను ఎలా ఆయనను సత్కరించగలను? గౌరవించగలను? నా ఈ దరిద్రతను తలచుకొంటే హృదయంలో ప్రీతి గానీ ప్రామోద్యం గానీ కలుగడం లేదు. ఏదో ఒకటి చేయాలి. నన్ను నేను ఎవరికైనా విక్రయించుకొని ఆ వచ్చిన మూల్యంతో ధర్మోద్గతుణ్ణి సత్కరిస్తాను. అనవరాగ్రమైన ఈ సంసారంలో కోటానుకోట్ల ఆత్మభావాలు (bodies) భగ్నము లైనాయి, క్షీణించాయి, నశించాయి. కానీ ఇటువంటి ఒక సత్కార్యానికి అవి ఉపయోగపడకుండానే వృధా అయినాయి" అని కృతనిశ్చయుడై ప్రయాణం సాగించాడు.

ప్రయాణంలో అపరాజిత నగరం చేరాక సదాప్రరుదితుడు విపణి వీధుల్లో "ఎవరికి మనిషి కావాలి?" అని ఘోషిస్తూ తిరిగాడు. పాపాత్ముడైన మారుడికి అది నచ్చలేదు. "ఇతను తన్ను తాను విక్రయించుకొని ధర్మోద్గతుణ్ణి సత్కరించి ప్రజ్ఞాపారమితను విన్నాడంటే ఆపైన నాకు అసాధ్యుడైపోతాడు. నా అధీనంలో

ఉన్న ప్రజలను నా పిడికిలి నుండి తప్పించగలిగే శక్తిమంతుడైపోతాడు. కనుక అడ్డుకుంటాను" అని నిశ్చయించి సదాప్రరుదితుని ఘోషణం ఎవరూ ఆలకించని విధంగా చేశాడు. సదాప్రరుదితుడు తన ప్రయత్నం ఫలించకపోవడం చూసి తీవ్ర పరితాపానికి లోనయి ఏకధారగా కన్నీళ్ళు కార్చుతూ నిలబడినాడు. దేవరాజు శక్రుడు అతని ధర్మకామతను పరీక్షించదలచి, యువకుని రూపం ధరించి అతణ్ణి సమీపించి "కులపుత్రా (son of a good family), ఎందుకు దీనదీనంగా విలపిస్తూ కన్నీళ్ళు కార్చుతున్నావు?" అని ప్రశ్నించాడు. "ఆర్యధర్మోద్గతుణ్ణి సత్కరించడానికి ధర్మపూజ చేయడానికి నన్ను నేను విక్రయించుకోదలచాను. కానీ నా ప్రయత్నాలు విఫలమయ్యాయి. మాణవకా (young man), నీవైనా నాకు సహాయపడితే ఆనందిస్తాను" అన్నాడు సదాప్రరుదితుడు. "మనిషితో నాకు అవసరం లేదు. కానీ మా నాన్నగారు ఒక యజ్ఞం చేస్తున్నారు. దానికి మనిషి హృదయం, రక్తం, అస్థిమజ్జ (marrow) కావాలి. ఇవ్వడానికి నీవు సిద్ధమేనా?" అన్నాడు అతడు. ఆ మాణవకుని మాటలు వినగానే సదాప్రరుదితుడు హృష్టచిత్తుడయ్యాడు. "ఆహా! ఇప్పటికి గదా నా మనోరథం నెరవేరింది! ఈ మాణవకుడు క్రాయకుడుగా (buyer) లభించాడు" అనుకొని పరమ ప్రమోదంతో దుష్కరచర్యకు ఉపక్రమించాడు. వీరిరువురి సంభాషణను ప్రాసాదతలం నుండి వినిన శ్రేష్ఠిదారిక (merchant's daughter) వేగంగా క్రిందికి దిగి వీధిలోనికి వచ్చి సదాప్రరుదితుణ్ణి ఆ దుష్కరచర్య నుండి వారిస్తూ "కులపుత్రా, ఎందుకీ దుష్కరచర్యకు పూనుకొంటున్నావు? దీని వలన నీకు కలిగే ప్రయోజనం ఏమిటి?" అని ప్రశ్నించింది. "దారికా (బాలికా), ధర్మోద్గతుణ్ణి సత్కరించి పూజించి ప్రజ్ఞాపారమితను వినదలచాను. అనుత్తర సమ్యక్ సంబోధిని పొంది సకల జీవులను సముద్ధరించే శక్తిని బడయదలచాను. సువర్ణ వర్ణమైన దేహాన్ని ముప్పై రెండు మహాపురుష లక్షణములతోనూ (auspicious signs) ఎనభై అనువ్యంజనములతోనూ (minor signs) అనంత దిశలకు ప్రభలు విరజిమ్మే వ్యామప్రభతోనూ (halo) విరాజమానంగా ఉండే రూపకాయాన్ని

పొందదలచాను. మహామైత్రిని, మహాకరుణను, మహాముదితను, మహాఉపేక్షను పొందదలచాను. నాలుగు వైశారద్యములను (four grounds of self - confidences), నాలుగు ప్రతిసంవిత్తులను (four analytical knowledges), ఐదు అభిజ్ఞలను (five super knowledges), పద్దెనిమిది ఆవేణిక బుద్ధ ధర్మాలను (eighteen special dharmas of Buddha), దశ బలములను (ten powers of Tathagata) పొందదలచాను" అన్నాడు సదాప్రరుదితుడు. "ఆశ్చర్యం, ఆశ్చర్యం కులపుత్రా, ఆశ్చర్యం! ఉదారములు (exalted), ప్రణీతములు (sublime) అయిన ధర్మాలను పొందదలచావు. నీవు చెప్పిన పెక్కు ధర్మాలలో ఒక్క ధర్మం పొందడానికైనా సరే గంగానదీ ఇసుక రేణువులు ఎన్ని ఉన్నాయో అన్ని కల్పాల్లో (aeons) సముపార్జించుకొన్న పుణ్యరాశి కూడా సరిపోదు! ధర్మోద్గతుణ్ణి సత్కరించడానికోసం కావలసిన పూజా ద్రవ్యములన్నిటినీ తీసుకొని నేను నీ వెంట వస్తాను. ఆయన అనుగ్రహంతో మన జీవితాలను ధన్యం చేసుకొందాము" అని పలికింది శ్రేష్ఠిదారిక. మాణవకుడు నిజరూపం ధరించి "సదాప్రరుదితా, నీ దృఢచిత్తాన్ని, ధర్మార్థికతను మెచ్చుకొని నీకు ఒక వరం ఇవ్వదలచాను కోరుకో" అన్నాడు. "అనుత్తరమైన (supreme) బుద్ధ ధర్మాలను నాకు ఇవ్వండి" అన్నాడు సదాప్రరుదితుడు. "నాకు ఇవ్వడానికి సాధ్యం కాని వరాన్ని కోరావు. నా వల్ల కాదు" అని శక్రుడు అంతర్ధానమయ్యాడు.

శ్రేష్ఠిదారిక, సదాప్రరుదితుడు రథారూఢులై గంధవతీనగరానికి ప్రయాణం చేశారు. నగరం పొలిమేరలో దివ్యమైన కూటాగారాన్ని (pointed tower) చూశారు. దివ్యమైన మందార పుష్పాలను చందన చూర్ణాన్ని సువర్ణ చూర్ణాన్ని ఆ కూటాగారం మీద వెదజల్లుతూ పరమభక్తితో అర్చిస్తున్న అసంఖ్యాక దేవతా గణాన్ని చూశారు ఆ దేవతాగణం మధ్యలో ఉన్న ఇంద్రుణ్ణి చూసి సదా ప్రరుదితుడు ఆశ్చర్యంతో "ఈ కూటాగారం మీద దేవతాగణాలు ఎందుకు ఇంత భక్తిని చూపుతున్నారు?" అని ప్రశ్నించాడు. "దేవతలు భక్తితో పూజింపదగినది ఇంతకన్నా శ్రేష్ఠమైనది ఈ లోకంలో వేరే ఏదీ లేదు. ఈ కూటాగారంలో ధర్మోద్గత లిఖిత ప్రజ్ఞాపారమితా

గ్రంథం ఉన్నది. ఆయన బంగారు పట్టీల మీద వైడూర్యం కరిగించి చేసిన సిరాతో ప్రజ్ఞాపారమితను లిఖించి ఏడు ముద్రలతో (seals) ఇందు భద్రపరచినాడు. ప్రజ్ఞాపారమితామాత దర్శనం మేము చేయలేకపోయినా ఆమె ప్రతిరూపంగా భావించి ఈ కూటాగారాన్ని అర్చిస్తున్నాము" అన్నాడు భక్తి పరవశంతో శక్రుడు. సదాప్రరుదితుడు వెంటనే రథాన్నుంచి క్రిందకు దిగి ఆ కూటాగారానికి ప్రదక్షిణం చేసి "తథాగతజననీ, బోధిసత్త్వమాతా, దేవీ ప్రజ్ఞాపారమితమాతా" అంటూ సాష్టాంగ నమస్కారం చేశాడు. శ్రేష్ఠిదారిక కూడా పూజా ద్రవ్యాలతో ఆ కూటాగారాన్ని పరమ భక్తితో అర్చించింది.

"ధర్మోద్గతుడు నివసిస్తున్న పరమ పావన క్షేత్రానికి వచ్చాము. ఇక రథారూఢులై పయనించడం తగదు. కాలినడకన పోదాము" అని సదాప్రరుదితుడు ముకుళిక హస్తాలతో కాలినడకన బయలు దేరాడు. శ్రేష్ఠిదారిక అతణ్ణి అనుసరించి నడిచింది.

* * *

"తథాగతులు ఎక్కణ్ణుంచి వచ్చారు? ఎక్కడికి వెళ్ళారు?" అని సదాప్రరుదితుడు అడిగిన ప్రశ్నకు ధర్మోద్గతుని సమాధానం.

ధర్మోద్గతుడు : కులపుత్రా, తథాగతులు ఎక్కణ్ణుంచీ రాలేదు, ఎక్కడికీ వెళ్ళనూ లేదు. తథాతా (suchness) అచలితము (does not move). తథతా ఏదియో అదియే తథాగతుడు. కులపుత్రా, అనుత్పాదం (non-production), వచ్చేది కాదు, పోయేది కాదు. ఏది అనుత్పాదమో అదియే తథాగతుడు. కులపుత్రా, భూతికోటి (reality-limit) యొక్క ఆగమనమూ (coming) తెలియబడడం లేదు, గమనమూ (going) తెలియబడడం లేదు. భూతికోటి ఏదియో అదియే తథాగతుడు. కులపుత్రా, అలాగే శూన్యతకు (emptiness) ఆగమనమూ లేదు గమనమూ లేదు ఏది శూన్యతయో అదియే తథాగతుడు. కులపుత్రా, యథావత్తా (what exists in

accordance with fact) ఆగమనం లేనిది, గమనమూ లేనిది. ఏది యథావత్తా అదియే తథాగతుడు. కులపుత్రా, విరాగం (disapassion) ఆగమనం లేనిది, గమనమూ లేనిది. ఏది విరాగమో అదియే తథాగతుడు. కులపుత్రా, నిరోధమునకు (stopping) ఆగమనం లేదు, గమనమూ లేదు. ఏది నిరోధమో అదియే తథాగతుడు. కులపుత్రా, ఆకాశధాతువు (element of space) యొక్క ఆగమనమూ తెలియబడడం లేదు, గమనమూ తెలియబడడం లేదు. ఏది ఆకాశధాతువో అదియే తథాగతుడు. కులపుత్రా, ఈ ధర్మాలకు బాహ్యంగా, భిన్నంగా తథాగతుడు లేడు. ఈ ధర్మముల తథతా (suchness) ఏదియో, సర్వధర్మముల తథతా ఏదియో తథాగతుని తథతా ఏదియో ఇదంతా ఒకే తథతా (suchness) తథతాకు ద్వైధీకారం (division) లేదు. ఒకటి రెండు మూడు అనే లెక్కకు అవతలది తథతా ఎందుకంటే అసత్త్వం (it is not) కనుక. కులపుత్రా, వేసవి కాలం మధ్యాహ్న సమయంలో ఒకానొకడు దూరంలో స్యందమానమైన (floating) మరీచికను (ఎండమావిని) చూసి "అదిగో అక్కడ నీళ్ళు, వెళ్ళి త్రాగుతాను" అని అటువైపుగా పరుగెత్తుతాడు కదా! ఆ నీళ్ళను గురించి నీవేమనుకొంటున్నావు? ఆ నీళ్ళు ఎక్కణ్ణుంచి వచ్చాయి? మళ్ళీ ఏ సముద్రంలో పోయి కలిశాయి?

సదాప్రరుదితుడు : మరీచికలో నీళ్ళే లేనప్పుడు "అవి ఎక్కణ్ణుంచి వచ్చాయి? ఎక్కడికి వెళ్ళాయి?" అనే ప్రశ్నకే అవకాశం లేదు. దప్పికతో తపిస్తున్న ఆ బాలజాతీయుడు (foolish fellow), దుష్ప్రజ్ఞజాతీయుడు (stupid fellow) మరీచికను చూసి అక్కడ లేని ఉదకం పట్ల ఉదకసంజ్ఞను (idea of water) పుట్టించుకొని పరుగెత్తుతాడు. కానీ అక్కడ ఉదకం స్వభావతః (in it's own being) లేదు.

ధర్మోద్గతుడు : కులపుత్రా, నీవన్నది నిజం. అలాగే ఎవరైతే తథాగతునికి రూపాన్ని వాక్కును కల్పిస్తారో వాళ్ళు తథాగతుని ఆగమానాన్ని కల్పిస్తారు (imagine), గమనాన్ని కల్పిస్తారు. వీళ్ళను కూడా బాలజాతీయులు, దుష్ప్రజ్ఞజాతీయులనియే

చెప్పవలెను. తథాగతుణ్ణి రూపకాయంగా చూడరాదు. ధర్మకాయంగా చూడవలెను. ధర్మతకు (real nature of dharmas) ఆగమనం లేదు, గమనమూ లేదు. మాయాకార నాటకంలో (magical show) కనిపించిన రథ గజ తురగ పదాతులకు ఆగమనమూ లేదు గమనమూ లేదు. అలాగే తథాగతుని విషయమూ. కులపుత్రా, ఒకానొకడు స్వప్నంలో ఒక తథాగతుణ్ణి, ఇద్దర్ని ముగ్గుర్ని నలుగుర్ని ఐదుగుర్ని ఆరు ఏడు ఎనిమిది తొమ్మిది పది ఇరవై ముప్పై నలభై ఏభై వంద వేయి ఇంకా అధిక సంఖ్యలోనూ తథాగతులను చూసి మేల్కొన్నాక అతనికి ఒక్క తథాగతుడు కూడా కనిపించడు కదా, నీవేమనుకొంటున్నావు? స్వప్నంలో కనిపించిన ఆ తథాగతులు ఎక్కణ్ణుంచి వచ్చారు? ఎక్కడికి వెళ్ళిపోయారు?

సదాప్రరుదితుడు : స్వప్నంలో కనిపించేవి దేనికీ పరినిష్పత్తి (status of full and perfect reality) లేదు. స్వప్నం కేవలం మృషావాదమే (deceptive)

ధర్మోద్గతుడు : నీవన్నది నిజం. "సర్వధర్మాః స్వప్నోపమాః" అన్నాడు భగవానుడు. ఇది తెలియనివాళ్లు తథాగతుణ్ణి నామకాయంగా రూపకాయంగా భావించి ఆగమనాన్ని గమనాన్ని కల్పిస్తారు (imagine). ధర్మతను (true nature of dharmas) తెలియనివాళ్ళందరూ బాలజాతీయులైన పృథక్‌జనులు (foolish common people). వీళ్ళు సంసార చక్రంలోనే తిరుగుతూ ఉంటారు. ప్రజ్ఞాపారమితకు, బుద్ధధర్మాలకు దూరం అవుతారు. భగవానుని ఉపదేశాన్ని యథాతథంగా గ్రహించినవాళ్ళు దేనియొక్క ఆగమానాన్నీ కల్పించరు, గమనాన్నీ కల్పించరు. ఉత్పాదమునూ (production) కల్పించరు, నిరోధమునూ (stopping) కల్పించరు. అనుత్తర సమ్యక్ సంబోధికి సమీపంలో చరించేవాళ్ళవుతారు. ప్రజ్ఞాపారమితకు సమీపంగా చరించేవాళ్ళవుతారు. రాష్ట్రపిండానికి (alms) న్యాయం చేకూర్చేవాళ్ళవుతారు. దక్షిణీయులవుతారు (worthy of gifts). కులపుత్రా, వీణ నుండి శబ్దం పుట్టినపుడు అది ఎక్కణ్ణుంచో రాలేదు. ఆగినపుడు ఆ శబ్దం ఎక్కడకో వెళ్ళిపోలేదు. హేతుప్రత్యయ సామగ్రిని (causes and conditions) అపేక్షించి (depending) శబ్దం

ఉత్పన్నమయింది. ద్రోణిని (boat shaped hollow body of the veena) అపేక్షించి, చర్మాన్ని (parchment sounding board) అపేక్షించి, తంత్రులను (strings) అపేక్షించి, దండాన్ని (hallow arm of the veena) అపేక్షించి, ఉపధానములను (bindings) అపేక్షించి, కోణమును (plectrum) అపేక్షించి, పురుష వ్యాయామాన్ని (exertion of the person who plays it) అపేక్షించి వీణా శబ్దం వెలువడుతుంది. హేతు (causes) ప్రత్యయ (conditions) అధీనంగా శబ్దం వెలువడుతుంది. ద్రోణినుండి మాత్రమే వెలువడదు. అలాగే ఇతరముల నుండి మాత్రమే వెలువడదు. అన్నిటి సమాయోగం (combination) వల్ల శబ్దం వెలువడుతుంది. శబ్దం వెలువడినపుడు అది స్వభావతః (in it's own being) ఎక్కణ్ణుంచో రాలేదు. శబ్దం ఆగినపుడు అది స్వభావతః (in it's own being) ఎక్కడికో వెళ్ళిపోలేదు. అలాగే భగవంతులైన తథాగతుల దివ్యశరీరములు హేతు ప్రత్యాయాధీనములు. అనేక కుశల మూల ప్రయోగ పరినిష్పన్నములు (it has been brought to perfection through exertions which have led to many wholesome roots). ఒక హేతువు వల్ల ఒక ప్రత్యయం వల్ల ఒక కుశలమూలం వల్ల బుద్ధకాయం ప్రభవించలేదు. అహేతుకమూ (without cause) కాదు. అనేక హేతు ప్రత్యముల వల్ల సముత్పన్నమయింది. సముత్పన్నమైనప్పుడు స్వభావతః (in it's own-being) ఎక్కణ్ణుంచో రాలేదు. అంతర్థానమైనపుడు. స్వభావతః (in it's own-being) ఎక్కడికో వెళ్ళిపోలేదు. కులపుత్రా, అలాగే సర్వధర్మముల విషయాలలోనూ నీవు ఈ ధర్మతనే (true nature of all dharmas) చూడాలి. తథాగతులను మరియూ సర్వధర్మములను అనుత్పన్నములుగా (neither produced) అనిరుద్ధములుగా (nor stopped) నీవు తెలుసుకొన్నావు కనుక అనుత్తర సమ్యక్ సంబోధికి అర్హుడవయ్యావు. ప్రజ్ఞాపారమితలోనూ ఉపాయ కౌశల్యంలోనూ (skill in means) చరిస్తావు.

తథాగత ఆగమన గమనములను నిషేధిస్తూ ధర్మోద్గతుడు చేసిన పరమ గంభీరమైన ఆ భాషణమునకు మహాపృథ్వి మరియు త్రిసాహస్రమహాధాతువు

(great trichiliocosm) ఆరు విధములుగా చలించి పోయింది, కంపించి పోయింది. మార భవనములన్నీ సంక్షోభం చెందాయి. త్రిసాహస్రమహాధాతువులో ఉన్నట్టి తృణ (grasses) గుల్మ (shrubs) ఔషధి (herbs) వనస్పతులు (trees) అన్నీ కూడా ధర్మోద్గతుడు ఉపవిష్టుడై ఉన్నట్టి దిక్కునకు భక్తితో వంగినాయి. అంతరిక్షం నుండి ఇంద్రుడు, దిక్పాలకులు దివ్య చందనచూర్ణాలను దివ్యపుష్పాలను వెదజల్లుతూ ధర్మోద్గతుణ్ణి అర్చించి ఇలా అన్నారు : "నేడు కదా మన జన్మ ధన్యమయినది! మహాసత్త్వుడైన ఈ బోధిసత్త్వ ధర్మోద్గతుడు చేసిన పరమార్థ ప్రసంగం మహా గంభీరంగా ఉన్నది. సర్వలోక విప్రత్యనీకంగా (contrary to the whole world) ఉన్నది. సత్కాయదృష్టిలో (individuality view) నాటుకుపోయినట్టివారికి, దృష్టిపరామర్శల్లో (speculative or dogmatic views) చిక్కుకుపోయినట్టివారికి ఈ పరమగంభీర భాషణము ఒక ముక్క కూడా అర్థం కాదు."

* * *

సూర్యాస్తమయ్యింది. ధర్మోద్గతుడు ఆసనం నుండి లేచి తన నివాసభవనానికి వెళ్ళాడు. సదాప్రరుదితుడు ఆ చోటు వదలి పెట్టలేదు. "ధర్మకాముడనైన నేను జాగరూకుడనై ఉంటాను. ధర్మోద్గతుడు మళ్ళీ ధర్మాసనం మీదికి వచ్చేవరకు నేను కూర్చోను, పడుకోను. నిలిచి ఉంటాను లేదా నడుస్తుంటాను" అనుకొని ఆ రెండు ఈర్యాపథముల (bodily postures) యందే దేహాన్ని ఉంచుతూ ఆ రాత్రి జాగరం చేశాడు. స్త్యానమిద్ధములకు (sloth and torpor), కామ వితర్కములకు (preoccupation with sense desires) వ్యాపాద వితర్కానికి (ill-will) చిత్తంలో చోటివ్వలేదు. "ధర్మోద్గతుడు మళ్ళీ ఎప్పుడు వస్తాడు, ఎప్పుడు మళ్ళీ ఆ దివ్య సందేశాన్ని వినగలుగుతాను?" అనే తలంపుతో జాగరం చేశాడు. శ్రేష్ఠిదారిక కూడా అతణ్ణి అనుసరించి జాగరం చేసింది.

* * *

ధర్మోద్గతుడు మళ్ళీ ధర్మాసనం మీదికి వచ్చే వేళ అయ్యింది. సదాప్రరుదితుడు చక్కగా ఆసనాన్ని అమర్చి పరిసరాలను శుభ్రం చేసి ఆ మహాసత్త్వుని రాక కోసం కాచుకొన్నాడు. గాలికి దుమ్ము రేగడం చూశాడు. "అయ్యో, ఈ దుమ్ము ఆ మహాసత్త్వుని మీదికి పోతుంది కదా! ఎలా?" అనుకొని నీళ్ళు చిమ్మదలచి నీటి కోసం చూశాడు. పాపాత్ముడైన మారుడు సదాప్రరుదితుని చిత్తాన్ని క్రుంగదీసి దౌర్మనస్యం పాలు చేసి అతని ధర్మోత్సాహాన్ని దెబ్బతీయాలనుకొన్నాడు. సదాప్రరుదితునికి ఒక బొట్టు నీళ్ళు కూడా లభించకుండా చేశాడు. మహాసత్త్వుడైన బోధిసత్త్వ సదాప్రరుదితుని చిత్తం వికారం చెందలేదు. "నీళ్ళు దొరక్కపోతే ఏమి? ఈ భూప్రదేశాన్ని నా రక్తంతో తడుపుతాను. అనవరాగ్రమైన (beginningless and endless) ఈ సంసారంలో ఎన్నో సార్లు ఈ దేహం వృధాగా భగ్నం అయ్యింది. ఇంతటి పుణ్యకార్యం కోసం ఇప్పుడు భగ్నం చేయడానికి విచారం ఎందుకు? ధర్మోద్గతుని మీదికి దుమ్ము పోరాదు. ఇదియే నాకు ముఖ్యం" అనుకొని ఉద్యుక్తుడయ్యాడు. అతని త్యాగ నిశ్చయాన్ని దివ్యదృష్టితో తెలిసికొనిన ఇంద్రుడు "సదాప్రరుదితుడు అనుకొన్నది తక్షణం చేసివేస్తాడు. అతణ్ణి అనుసరిస్తూ శ్రేష్ఠిదారిక కూడా అలానే త్యాగానికి సిద్ధపడుతుంది. దీన్ని నివారించాలి" అనుకొని తన ప్రభావంతో ఆ భూప్రదేశాన్ని వెంటనే దివ్య చందన ఉదకంతో తడిపివేశాడు.

* * *

అనేక లక్షల సంఖ్యలో గుమికూడిన ఆ పర్షదంలో (సభ = assembly) ధర్మోద్గతుడు గావించిన ప్రజ్ఞాపారమితాదేశన (demonstration of the perfection of wisdom) వినిన సదాప్రరుదితునికి క్రింది సమాధులు (concentrations) కలిగాయి.

1. **సర్వధర్మసమతా నామ సమాధిరాజః**

King of concentrations called the sameness of all dharmas

2. సర్వధర్మవివిక్తశ్చ నామ సమాధిః

isolation of all dharmas

3. సర్వధర్మాచలనశ్చ నామ సమాధిః

immobility of all dharmas

4. సర్వధర్మామననశ్చ నామ సమాధిః

absence of all mental acts in all dharmas

5. సర్వధర్మాస్తంభితశ్చ నామ సమాధిః

lack of numbness in all dharmas

6. సర్వధర్మైకరసశ్చ నామ సమాధిః

the one taste of all dharmas

7. సర్వధర్మాపర్యంతశ్చ నామ సమాధిః

boundlessness of all dharmas

8. సర్వధర్మానుత్పాదశ్చ నామ సమాధిః

non-production of all dharmas

9. సర్వధర్మానిరోధశ్చ నామ సమాధిః

non-stopping of all dharmas

10. గగనాపర్యంతశ్చ నామ సమాధిః

boundless like the firmament

11. సముద్రాపర్యంతశ్చ నామ సమాధిః

boundless like the ocean

12. మేరువిచిత్రశ్చ నామ సమాధిః

brilliant and multi-coloured like Meru

13. గగనాకల్పశ్చ నామ సమాధిః
non fashioned, like the firmament

14. రూపాపర్యంతశ్చ నామ సమాధిః
boundless like form

15. వేదానాపర్యంతశ్చ నామ సమాధిః
boundless like feelings

16. సంజ్ఞాపర్యంతశ్చ నామ సమాధిః
boundless like ideas

17. సంస్కారాపర్యంతశ్చ నామ సమాధిః
boundless like karma formations

18. విజ్ఞానాపర్యంతశ్చ నామ సమాధిః
boundless like cognitions

19. పృథివీధాత్వపర్యంతశ్చ నామ సమాధిః
boundless like form

20. అబ్ధాత్వపర్యంతశ్చ నామ సమాధిః
boundless like water

21. తేజోధాత్వపర్యంతశ్చ నామ సమాధిః
boundless like fire element

22. వాయుధాత్వపర్యంతశ్చ నామ సమాధిః
boundless like air element

23. ఆకాశధాత్వపర్యంతశ్చ నామ సమాధిః
boundless like space element

**24.** **విజ్ఞానధాత్వపర్యంతశ్చ నామ సమాధిః**

boundless like cognition element

**25.** **వజ్రోపమశ్చ నామ సమాధిః**

adamantine

**26.** **సర్వధర్మాసంభేదశ్చ నామ సమాధిః**

non-differentiatedness of all dharmas

**27.** **సర్వధర్మానుపలబ్ధిశ్చ నామ సమాధిః**

non-apprehension of all dharmas

**28.** **సర్వధర్మావిభావనాసమతా నామ సమాధిః**

sameness of all dharmas whatever they may be surpass

**29.** **సర్వధర్మనిశ్చేష్టశ్చ నామ సమాధిః**

all dharmas are powerless to act

**30.** **సర్వధర్మాచింత్యశ్చ నామ సమాధిః**

all dharmas are unthinkable

ఇవి గాక ఇంకా అరవై లక్షల రకాల సమాధులను మహాసత్త్వుడైన బోధిసత్త్వ సదాప్రరుదితుడు పొందాడు.



# పలిబోధలు

*(Impediments)*

**1. నివాసం** : నివాసం అనేది ప్రతిబంధకం కారాదు. కానీ కొన్ని పరిస్థితుల్లో ఇది ధ్యానానికి ప్రతిబంధకమై కూర్చుంటుంది. నివాసంలో ఎక్కువ వస్తువులు సేకరించి పెట్టుకోవడం అలాంటి పరిస్థితుల్లో ఒకటి. లోకక్షేముడు లాంటివాడికి ఏ నివాసమూ బంధకం కాదు. అమోఘసిద్ధికి చిన్న గుడిసె అయినా బంధకమే.

**2. అయినవాళ్ళు** (family, relations etc) : భిక్షువుకు సమదృష్టి అవసరం. బంధువులు, మిత్రులతో ఎక్కువ సంబంధాలు పెట్టుకుంటే సమదృష్టికి విఘాతం కలుగుతుంది. tribal feelings పెద్ద ప్రతిబంధకమే. ఇల్లూ వాకిలి వదలి ఎక్కడో ఉన్నప్పటికీ tribal feeling ని మరో రకంగా తృప్తి పరచుకొనేవాళ్ళు చాలామంది కనిపిస్తారు. బంధువుల స్థానంలో వీళ్ళు భక్తులు (devotees) అనే వర్గాన్ని ఏర్పరచుకొని tribal feelings లో చిక్కుకొన్నారు. భిక్షువులు మతిభద్రుడు లాగా ఉండాలి. కోరండక నగరంలో ఒక సంపన్న కుటుంబంలో మతిభద్రుడు జనించాడు. తలిదండ్రులు ఉపాసకులు. మతిభద్రుణ్ణి చాలా చిన్న వయస్సులోనే కోరండక విహారంలో చేర్చారు. కొన్నాళ్ళ తరువాత ఆ విహారంవాళ్ళు అతణ్ణి రోహణ నగర విహారానికి పంపారు. పాతికేండ్లు అక్కడే ఉన్నాడు. స్వస్థలం వెళ్ళలేదు చిన్నతనంలో తనకు విద్యాబుద్ధులు చెప్పిన కోరండక విహారభిక్షువు వృద్ధుడయ్యాడు. ఆయనను ఒకసారి చూసిరావాలని మతిభద్రుడు కోరండకానికి బయలుదేరాడు చాలా రోజుల ప్రయాణం తరువాత కోరండక విహారం చేరి ఆ వృద్ధభిక్షువుకు

నమస్కరించి తనను పరిచయం చేసుకొన్నాడు. వృద్ధభిక్షువు చాలా ఆనందించి ఒక చక్కని గదిని అతనికి విడిదిగా కేటాయించి ఇలా అన్నాడు : "ఈ గదిలో ఉన్న భిక్షువు తప్పనిసరిగా పాటించవలసిన నియమం ఉన్నది. ఈ గదిలో ఉన్నవాళ్ళు దీన్ని కట్టించిన దాతల ఇంటిలోనే భిక్ష తీసుకొనివలెను. ఆ దాతలెవరో కారు. నీ తల్లిదండ్రులే."

మతిభద్రుడు ఒక వారం రోజులు అక్కడ ఉన్నాడు. మహాస్థవిరుడు (senior most monk) చెప్పిన నియమాన్ని పాటిస్తూ తన తలిదండ్రుల నివాసానికే ప్రతిదినమూ భిక్షకు వెళ్ళాడు.

మతిభద్రుడు రోహణ నగరానికి వెనుదిరిగి వెళ్ళిన దినమే అతని తల్లి విహారానికి వచ్చి మహాస్థవిరునికి నమస్కరించి "భదంతా, ఈ వారం దినాలుగా మా ఇంటికి వచ్చి ఆతిథ్యం స్వీకరించి వెళ్ళిన ఆ యువభిక్షువును చూసినపుడల్లా నా కుమారుడే జ్ఞాపకానికి వచ్చాడు. ఐదేండ్ల వయస్సులో మీ చేతికి అప్పగించాక మళ్ళీ చూడలేదు. రోహణ నగరంలో ఉన్నాడని మాత్రం తెలుసు. ఇప్పుడు చూడడానికి, ఆ యువ భిక్షువులాగా ఉంటాడని ఊహిస్తున్నాను." అనింది. మహాస్థవిరుడు ఆశ్చర్యంతో "అతను నీకేమీ చెప్పలేదా? మీ కుమారుడే అతడు. నేనతనికి ఆ విషయం తెలియజేసి మరీ పంపాను కదా మీ ఇంటికి" అన్నాడు. ఆమె ఎంత గొప్ప ఉపాసకురాలైనా ఒక తల్లే కదా! విస్మయాన్ని విషాదాన్ని ఏకకాలంలో కలిగించిన స్థవిరుని మాటలు విని బిగ్గరగా ఏడ్చేసింది. కొంతసేపటికి తెప్పరిల్లి "నా కుమారుడు వారం దినాలు మా ఇంటికే వచ్చి భోంచేసి వెళ్ళినా పూర్తిగా అపరిచితవ్యక్తి లాగానే కొత్తవ్యక్తి లాగానే ప్రవర్తించాడు. నాకు చాలా గర్వంగా ఉన్నది. బుద్ధశాసనం నా కుమారుణ్ణి ఎంత గొప్పవాణ్ణి చేసిందో తలచుకొంటేనే ఒళ్ళు పులకరిస్తున్నది. రథవినీత మహాభిక్షువు నడచిన మార్గంలో నాలాక మహాభిక్షువు నడచిన మార్గంలో తుషితశీల మహాభిక్షువు నడచిన మార్గంలో నా కుమారుణ్ణి కూడా బుద్ధశాసనం నడిపిస్తున్నది" అని రోహణ నగరం దిక్కుగా

మోకరిల్లి నమస్కరించింది.

3. **లాభ** (gain), **సత్కార** (honour) **పూజలు** (worship) : సన్యాసులను సంసారుల స్థాయిలోనే పడి ఉండేలా చేసే మారుని వల ఇది. కనుక ముముక్షువులు ఎక్కడున్నా అజ్ఞాతులుగా (unknown గా) అపూర్వులుగా (strangers గా) ఉండడం శ్రేయస్కరం. పాదనమస్కారాల విషయం చాలా గమ్మత్తుగా ఉంటుంది. X అనే స్వామి వద్దకు Y అనే భక్తుడు వచ్చి చాలా వినయంగా పాదనమస్కారం చేశాడు. ఆశ్రమం దాటి రోడ్డు మీదకు వచ్చాక అతనికి Z అనే తెలిసిన వ్యక్తి కనిపించాడు. ఇద్దరూ పిచ్చాపాటి మాట్లాడుకొంటూ నడుస్తున్నారు. ఆ పిచ్చాపాటి మాటల్లో Z అనే వ్యక్తి, X ప్రస్తావన తెచ్చాడు. అప్పుడు Y అన్నాడు కదా ఆ X ని ఉద్దేశించి : "వాడొక దొంగముండాకొడుకు!"

4. **కట్టడాలు** : "సిమెంటు బస్తాలు ఇంకా ఎన్ని ఉన్నాయి? రంగయ్య మేస్త్రి పనికి ఎందుకు రాలేదు? ఆచారి (వడ్రంగి) ఏమంటున్నాడు?" సన్యాసిగా ఉన్నవాడు ఇలాంటి పనులు పెట్టుకొంటే ఇంక ధ్యానం ఎక్కడుంటుంది? కర్మయోగి అనిపించుకోవచ్చు!

5. **ప్రయాణాలు,** 6. **ఉపన్యాస కార్యక్రమాలు,** 7. **అనారోగ్యం,** 8. **పుస్తకాలు**

ఎనిమిదవది ధ్యానానికి అంతరాయం అనే విషయం స్పష్టమే. విపశ్యన కేంద్రం పదిరోజుల ధ్యానశిక్షణ కోర్సు నడుపుతున్నది కదా! ఆ పది రోజులూ పుస్తకాలు చదువనివ్వరు.

# ఆనాపానసతి

*(Mindfulness of Breathing)*

ఇష్టం వచ్చిన దిక్కుకు పరుగులు తీసే కోడెదూడ యొక్క పొగరు అణచాలంటే దాన్ని త్రాడుతో గుంజకు కట్టాలి. మొదట్లో అది ఎంతో ప్రయత్నం చేస్తుంది-తెంపుకొని పోవడానికి. సాధ్యం కాదని తెలిశాక గుంజకు ఆనుకొని యోగిలాగా కూర్చుండి పోతుంది. అలాగే మనస్సును శమింపజేయడానికి అశ్వాస (in-breaths) ప్రశ్వాసలు (out-breaths) గుంజ వంటిది. స్మృతి (mindfulness) అనేది త్రాడులాంటిది.

ఆనాపానసతికి (mindfulness of breathing) రణగొణ ధ్వనులు లేని ప్రశాంత స్థలం అవసరం. ఊరికి కాస్త దూరంలో గానీ (అరణ్యం), ఏదేని వృక్షం క్రింద గానీ, శూన్యాగారం గానీ (empty place) అనుకూలం. శబ్దాలు, ధ్యానం చేసేవాళ్ళకు ముళ్ళులాంటివని పెద్దలు చెబుతారు.

కాళ్ళు మడిచి కూర్చునే పద్ధతి మంచి పద్ధతి. నడుమును మెడను తలను నిటారుగా ఉంచి కూర్చుంటే ధ్యానానికి అనుకూలిస్తుంది. ఇలా కూర్చోవడం వల్ల దేహంలోని నాడీమండలం (sinews) వగైరా ముడతలు పడవు (not twisted).

అశ్వాస ప్రశ్వాసల మీదనే మనసును నిలపడానికి గణన (counting) తొలి ఉపాయం. గణనకు మరీ తక్కువ సంఖ్య మరీ ఎక్కువ సంఖ్య కాకుండా మధ్యే మార్గంగా పది సంఖ్యగా ఉంటే మంచిది. గణన ఎలా చేయాలి? అసలు ఆశ్వాస ప్రశ్వాసల మీద మనస్సు పెట్టడం ఎలా? ఆశ్వాస ప్రశ్వాసలు దీర్ఘంగానూ (long) జరుగవచ్చు (పాములు ఏనుగుల మాదిరి); హ్రస్వంగానూ (short) జరుగవచ్చు

(శునకములు, కుందేళ్ళ మాదిరి). కనుక మనస్సును ఏ పాయింట్ మీద నిలపాలి అనే ప్రశ్న ఉదయిస్తుంది. కోటగుమ్మం వద్ద కాపలాదారుడు గుమ్మానికి ఇవతలి వ్యక్తుల మీద గానీ అవతలి వ్యక్తుల మీద గానీ ధ్యాస ఉంచడు. ద్వారం వద్ద నిలబడి లోనికి వచ్చే వ్యక్తులను బైటకు పోయే వ్యక్తులను మాత్రం పేరు ఊరు వచ్చిన పని అడుగుతూ ఉంటాడు. అలాగే ఆశ్వాస ప్రశ్వాస విషయమున్నూ. ముక్కు పుటాల గుండా లోనికి వస్తున్న గాలి బైటకు పోతున్న గాలి ముక్కు కొనను (నాసికాగ్రాన్ని) తాకుతూ ఉంటుంది. ఆ తాకిడి (స్పర్శ) మీదనే మనస్సును పెట్టాలి. గణన కూడా అక్కడే. లోనికి వస్తున్న వాయువు యొక్క ప్రథమ స్పర్శ సోకగానే ఒకటి, బైటకు పోతున్న వాయువు యొక్క చివరి స్పర్శ వద్ద రెండు ఇలా పది దాక లెక్కించి మళ్ళీ మొదటికి రావడం చేయాలి. గణన యొక్క అవసరం ఇక వద్దనుకొంటే గణనను ఆపివేసి కేవలం నాసికాగ్ర స్పర్శ మీదనే మనస్సును పెట్టవచ్చును.

ఇతర కర్మస్థానములన్నీ (meditation subjects) ఒక ఎత్తు, ఆనాపానసతి ఒక ఎత్తు. ధ్యానం కొనసాగేకొలదీ ఇతర కర్మస్థానములు (meditation subjects) స్పష్టం, మరీ స్పష్టం కావడం జరుగుతుంది. ఆనాపానసతి విషయంలో పూర్తి విరుద్ధంగా ఉంటుంది. ధ్యానం కొనసాగే కొలదీ ఆశ్వాస ప్రశ్వాసలు క్రమంగా సూక్ష్మం అయిపోతూ గమనికకు అందకుండా పోతాయి. శ్వాస ఆడడం లేదని భయపడిపోరాదు. ఇలా విచారించాలి : "గర్భస్థ శిశువులో శ్వాసప్రక్రియ ఉండదు నేను గర్భస్థ శిశువును కాను. నీటిలో మునిగిపోయినవానికి శ్వాస ఆడదు. నేను నీటిలో మునిగి పోలేదు. అసంజ్ఞిసమాపత్తిలోకంలో ఉన్నవాళ్ళకు (unconscious beings in the fine-material Brahma-world) శ్వాస ఉండదు. నేను ఈ భూలోకంలో ఉన్నాను. నాలుగవ ధ్యానంలోనూ, సంజ్ఞావేదనీయ నిరోధ సమాపత్తిలోనూ శ్వాస నిలిచిపోతుంది. నేను అసలు ఇంకా మొదటి ధ్యానంలోకే పోలేదు. మరణించినవాళ్ళలో శ్వాస ఆడదు. నేను బ్రతికే ఉన్నాను. కనుక శ్వాస జరుగుతూనే ఉంది. కాకపోతే సూక్ష్మం అయినట్లుంది. నా స్థూలబుద్ధికి తెలియడం

లేదు. కనుక దాన్ని మళ్ళీ తెలుసుకోవడానికోసం స్థానం (నాసికాగ్రం) మీదనే మనస్సును పెట్టాను."

పొలం దున్నే చెంగడికి కాసేపు విశ్రాంతి తీసుకోవాలనిపించింది. కాడి నుండి ఎద్దులను విప్పి వదిలేశాడు - "పాపం కష్టపడ్డాయి కాసేపు మేసి రానీ" అని. చెట్టు క్రింద పడుకొని చెంగడు ఒక కునుకు తీసి లేచాడు. మళ్ళీ పొలం దున్నాలనుకొన్నాడు. ఎద్దులు కనిపించలేదు. ఆ ప్రదేశమంతా వెతికే ప్రయత్నం చేయలేదు. అతనికి తెలుసు అవి ఎక్కడికెళ్ళి మేసినా చివరకు నీళ్ళు త్రాగడానికి మడుగు వద్దకు రావలసిందేనని. మడుగు వద్దకు వెళ్ళి కూర్చొన్నాడు. కాసేపటికి అవి నీళ్ళు త్రాగడం కోసం మడుగు వద్దకు వచ్చాయి. చెంగడు వాటిని పట్టుకొన్నాడు. అలాగే సూక్ష్మావస్థకు చేరిన ఆశ్వాస ప్రశ్వాసాలను కూడా. నాసికాగ్రం వద్ద మనస్సును పెట్టి నిరీక్షిస్తే ఆ నిరీక్షణ మనస్సును మరింత సూక్ష్మం చేస్తుంది. సూక్ష్మమైన మనస్సు ద్వారా ఆ సూక్ష్మ ప్రక్రియను గమనించగలగడం జరుగుతుంది.

ఆనాపానసతి (mindfulness of breathing) అభ్యాసం కొనసాగిస్తూ ఉంటే నిమిత్తము (mental reflex or image) పొడసూపడం ప్రారంభమవుతుంది. ధ్యానం (concentration) తొలిదశలో పొడసూపే నిమిత్తాన్ని పరికర్మ నిమిత్తం (preparatory image) అంటారు. ధ్యానంలో మరింత పురోగతి జరిగినప్పుడు ఉగ్గహ నిమిత్తం (acquired image) పొడసూపుతుంది. చివరగా ప్రతిభాగనిమిత్తం (counter-image) తలెత్తుతుంది. ఆ పైన ప్రథమ ధ్యానం ముంగిట్లోకి ప్రవేశించడం జరుగుతుంది. (stage of neighbourhood or access concentration = ఉపచార సమాధి). కర్మస్థానములను (meditation subjects) బట్టి నిమిత్తాలు. ఆనాపానసతికి సంబంధించిన నిమిత్తాల విషయంలో చిత్రమేమిటంటే మనిషి మనిషికి భిన్నభిన్నంగా ఉంటాయి. దూది స్పర్శ లాగా, పట్టు స్పర్శ లాగా, ఫ్యాన్ గాలి లాగా●

---

● *draught (ఉచ్చారణలో draft) = a current of air in an enclosed place*

మృదుస్పర్శానుభూతి మొదలుకొని నక్షత్రం, రత్నాలరాశి లేదా ముత్యాలరాశి, పుష్పవృత్తం (wreath of flowers), పొగ, సాలెగూడు. మేఘం, కమలం, రథచక్రం, చంద్రబింబం, సూర్యబింబం-ఇలా నిమిత్తాలు రకరకాలుగా ఏర్పడుతాయి. ఒక విహారంలో భిక్షువులు సూత్ర పారాయణం చేస్తున్నారు. పారాయణం అయ్యాక ఒక భిక్షువు "ఈ సూత్రం పర్వతసానువు నుండి క్రిందికి ఉరుకుతున్న జలపాతం లాగా ఉన్నది" అన్నాడు. మరొక భిక్షువు "అడవిలోని వృక్షాల వరుసలాగా ఉన్నది" అన్నాడు. మరొక భిక్షువు "నీడనిచ్చే విశాల ఫలవృక్షం వలె ఉన్నది ఈ సూత్రం" అన్నాడు. ఒకే సూత్రం వారి వారి దృష్టి భేదాన్ని* బట్టి భిన్నభిన్నంగా తోచిన విధంగానే ఆనాపానసతి వలన కలిగే నిమిత్తాలున్నూ.

ఇతర ధ్యాన పద్ధతుల ద్వారా అర్హత్వాన్ని పొందినవాళ్ళకు దేహాన్ని వదలివేసే సమయం ముందుగా తెలియవచ్చు, తెలియకపోవచ్చు. ఆనాపానసతి ద్వారా అర్హత్వాన్ని సాధించినవాళ్ళకు మాత్రం ఆ సమయం కూడా ఖచ్చితంగా ముందుగానే తెలుస్తుంది. కోటపర్వత విహారంలో స్థవిరతిష్యుడు, మహాకరంజియ విహారంలోని మహాతిష్యుడు, దేవపుత్ర విహారానికి చెందిన ఒక భిక్షువు, చిత్తలపర్వత విహారానికి చెందిన కొందరు భిక్షవులు ఈ కోవకు చెందినవారు. తిష్యుడికి తెలుసు ఆ దినం పదకొండు గంటల నలభై ఏడు నిముషాలకు ఆయుష్షు (life term) ముగిసిపోతుందని. దైనందిన కార్యక్రమం దేన్నీ వదలిపెట్టలేదు. మామూలుగా చేసే పనులు పూర్తి చేసుకొని చీవరం (robe) తొడుక్కొని భిక్షాపాత్ర తీసుకొని బయలుదేరాడు. కొంచం దూరం నడిచాక ప్రక్కనున్న భిక్షువుకు పదిగజాల దూరంలోని మలుపును చూపుతూ "అక్కడికి మనం చేరేలోపుగా నా ఆయుష్షు ముగుస్తుంది" అన్నాడు. సరిగ్గా అలాగే అయ్యింది. అలా నడుస్తూనే తిష్యుడు పరినిర్వాణం చెందాడు.

---

* *because of the difference in the manner of perceiving that occurred before the arising of the sign*

# ప్రకృతి

శార్దూలకర్ణావదానం 110 పేజీల పెద్ద కథ. ఇక్కడ మూడు పేజీల కథాభాగాన్ని మాత్రమే తీసుకొన్నాను. ఇందులో ఆనందుని ఒక వాక్యం గమనించదగినదిగా తోచినందువల్ల ఈ అవదానాన్ని (edifying story) ఇష్టపడ్డాను.

భగవానుడు శ్రావస్తీనగరంలోని జేతవనంలో ఉన్న సమయంలో ఒకనాడు ఆనందుడు భిక్షాటన చేసి తిరిగివస్తూ ఒక బావి వద్దకు వెళ్ళాడు. ఆ బావి నుండి నీటిని చేదుతున్న మాతంగదారికను (outcaste girl) నీళ్ళిమ్మని అడిగాడు. ఆమె పేరు ప్రకృతి. ఆమె ఆశ్చర్యచకితయై "భదంతా, నేను మాతంగదారికను" అని పలికింది. ఆమె మాట వెనుక దాగియున్న హెచ్చరికను ఆనందుడు పసిగట్టి "భగినీ (సోదరీ), నీ కులం, జాతి ఏమిటని నేనడగలేదు. నిన్నడిగింది నీళ్ళు మాత్రమే. నీకు సమ్మతమైతే ఈ పాత్రలో కొంచం నీళ్ళు పోయుము" అని భిక్షాపాత్రను ముందుకు సాచాడు.

ఆనందుడు నీళ్ళు త్రాగి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతున్న అతణ్ణే తదేకంగా చూస్తూ ప్రకృతి అలానే నిలబడిపోయింది. అతని ముఖప్రసన్నత, మాటల మధురిమ (sweetness) ఆమెను మిక్కిలి ఆకర్షించింది. మనస్సులో ఇలా అనుకొంటూ ఇంటికి బయలుదేరింది : "ఈయన నా స్వామి అయితే ఎంత బాగుండును! ఇది అసాధ్యమైన కోరిక ఏమీ కాదు. నా తల్లి మహావిద్యాధరి (మంత్రగత్తె). ఆనందుణ్ణి నా వద్దకు రప్పించే మంత్రశక్తి ఆమెకున్నది. నా మాటను కాదనజాలదు."

ఇంటికి వెళ్ళాక ప్రకృతి నేరుగా తల్లి వద్దకు వెళ్ళి "అమ్మా, మహాశ్రమణ గౌతముని సేవకుడు ఆనందుణ్ణి నేను స్వామిగా కోరుకొంటున్నాను. ఆయన్ను ఇక్కడికి రప్పించగలవా?" అని ప్రాధేయపడింది. "నాకు ఆ శక్తి ఉన్నది. అతడు మృతుడు కాని పక్షంలో వీతరాగుడు కాని పక్షంలో ఇక్కడికి రప్పించగలను. కానీ ఒక ఇబ్బంది ఉన్నది. ఈ దేశం రాజు ప్రసేనజిత్తు శ్రమణ గౌతముని భక్తుడు. మన చర్య అతనికి కోపం తెప్పిస్తే ఆపైన మన కులానికే పెద్ద అనర్థం జరిగిపోవచ్చు. అదీగాక శ్రమణ గౌతముని ముందు మన మంత్రాల శక్తి నిలబడదు" అనింది తల్లి. "అమ్మా, ఆనందుడు లభించకపోతే నేను బ్రతకను. లభిస్తే బ్రతుకుతాను" అనింది ప్రకృతి.

మహావిద్యాధరి ఇంటి మధ్యభాగాన్ని గోమయంతో అలికి దర్భలు పరచి వేదిని (altar) అమర్చి అగ్నిని వెలిగించి 108 అర్కపుష్పాలను ఒక్కొక్కటిగా తీసుకొని **"అమలే విమలే కుంకుమే సుమనే... ఆనందస్య ఆగమనాయ సంగమనాయ క్రమణాయ గ్రహణాయ జుహోమి స్వాహా"** అంటూ మంత్రాలు చెబుతూ అగ్నిలో వేల్చింది.

మహావిద్యాధరి మంత్ర ప్రభావం వల్ల ఆనందుని మనస్సు అల్లకల్లోలం అయింది. విహారం నుండి వెడలి మాతంగకన్యాగృహం చేరి వేది (altar) వద్ద నిలుచున్నాడు.

అభిజ్ఞాసంపన్నుడైన బుద్ధునికి విషయం తెలిసి మహావిద్యాధరీ మంత్రాలకు విరుగుడుగా సంబుద్ధ మంత్రాలను పఠించి ఆనందుని ఆగమనాన్ని ఆకాంక్షిస్తూ క్రింది శ్లోకాలు పలికాడు.

*స్థితిరచ్యుతిః సునీతిః స్వస్తి సర్వప్రాణిభ్యః*
*సరః ప్రసన్నం నిర్దోషం ప్రశాంతం సర్వతో ऽ భయమ్*
*ఈతయో యత్ర శామ్యంతి భయాని చలితాని చ*

**తద్వై దేవా నమస్యంతి సర్వసిద్ధాశ్చ యోగిన:**
**ఏతేన సత్యవాక్యేన స్వస్త్యానందాయ భిక్షవే**

బుద్ధుని సంకల్పశక్తి వల్ల ఆనందుడు మాతంగ గృహం నుండి వెడలి విహారం చేరాడు.

"బిడ్డా, మన మంత్రాలు గౌతముని అధ్యాత్మశక్తికి వ్యతిరేకంగా పనిచేయజాలవని గ్రహించావు కదా! కనుక అసాధ్యమైన విషయంలో వాంఛ తగదు" అని విద్యాధరి హితవు పలికింది.

మరునాడు ప్రకృతి తలస్నానం చేసి చక్కగా అలంకరించుకొని శ్రావస్తీనగర ద్వారం వద్దకు వెళ్ళి ఆనందుని రాకకోసం ఎదురుచూస్తూ నిలుచుంది. ఆనందుడు నగరవీధుల్లో పర్యటిస్తుంటే వెనుకనే నీడలాగా ప్రకృతి అతన్ని అనుసరించింది. అతను కూర్చుంటే తనూ కూర్చోవడం, నిలబడితే తనూ నిలబడడం చేస్తూ అతణ్ణి జేతవనం దాక అనుసరించింది. ప్రకృతి తనను నీడలాగా అనుసరిస్తూ వెంటబడడం ఆనందుడు గమనించి వేగంగా అడుగులు వేస్తూ జేతవనం చేరి బుద్ధుని పాదపద్మాలకు నమస్కరించాడు. వెనుకనే అంతే వేగంతో వస్తున్న ప్రకృతి కూడా ఆనందుణ్ణి అనుకరిస్తూ భగవానునికి పాదాభివందనం చేసింది. ఆనందుడు చాలా ఆవేదనతో "భగవాన్, నేనిక బైట అడుగు పెట్టలేను. ఈమె నన్ను వెంటాడుతున్నది" అని మొరపెట్టుకొన్నాడు. భగవానుడు ప్రకృతిని కరుణార్ద్ర దృష్టితో చూస్తూ "అమ్మాయీ, ఎందుకితణ్ణి ఏడిపిస్తున్నావు?" అన్నాడు. "నా స్వామిగా ఈయన్ను కోరుకొంటున్నాను" అనింది ప్రకృతి. "నీ తలిదండ్రుల అనుమతి కావాలి. వాళ్ళను ఇక్కడికి తీసుకొనిరమ్మ" అన్నాడు బుద్ధుడు.

ప్రకృతి, తల్లిదండ్రులను వెంటబెట్టుకొని వచ్చింది. వాళ్ళు భగవానునికి మూడు సార్లు ప్రదక్షిణం చేసి సమ్ముఖంలో కూర్చున్నారు. "మీ కుమార్తెను ఇక్కడ వదలిపెట్టిపోవడం మీకు సమ్మతమేనా?" ప్రశ్నించాడు బుద్ధుడు. "సమ్మతమే

సమ్మతమే" అని వాళ్ళు బదులు పలికి భగవానునికి పాదాభివందనం చేసి సెలవు తీసుకొని వెళ్ళిపోయారు. ప్రకృతి అక్కడే ఉండిపోయింది.

"ప్రకృతీ, ఆనందుణ్ణి స్వామిగా పొందాలనుకొంటున్నావు. మరి అతని వేషం నీవు కూడా ధరించాలి కదా" అన్నాడు బుద్ధుడు. ప్రకృతి సమ్మతించింది. **"ఏహి త్వం భిక్షుణీ చర బ్రహ్మచర్యం"** (come O nun, lead religious life) అన్నాడు బుద్ధుడు. ప్రకృతి ముండనం చేసుకొని కాషాయవస్త్రాలు ధరించి భిక్షుణి అయిపోయింది. బుద్ధుడు ఆమెకు పరమవైరాగ్యపూరితమైన అదీప్తసూత్రం (fire sermon) ఇంకా ఇతర సూత్రాలను బోధించాడు. రాగచరితగా విహారంలో అడుగుబెట్టిన ఆమె అచిరకాలంలోనే సంయోజనాలను* (fetters) త్రెంచివేసి అర్హతురాలయిపోయింది.

---

* *There are 10 fetters tying beings to the wheel of existence, namely 1 personality belief (సత్కాయదృష్టి), 2 sceptical doubt (విచికిత్స), 3 Clinging to mere rules and rituals (శీలవ్రత పరామర్శ), 4. sensuous craving, (కామరాగ), 5 ill-will (వ్యాపాద), 6. craving for fine-material existence (రూపరాగ), 7. craving for immaterial existence, (అరూపరాగ), 8. conceit (మాన), 9. restlessness (ఔద్ధత్య), 10. ignorance (అవిద్య)*



# హృదయ సూత్రం

*(Heart Sutra)*

పరిచయ వాక్యాలు

మహాయానం అనగానే ప్రజ్ఞాపారమిత సూత్రాలు, సద్ధర్మపుండరీక సూత్రం, అవతంసక సూత్రం, లంకావతార సూత్రం మొదలగునవి జ్ఞాపకానికి వస్తాయి. ఈ మహాయాన సూత్రాల గొప్పదనం ఏమిటోగాని పూజాపీఠాల మీద దేవుళ్ళకు సమానంగా పూజలు అందుకొంటున్నాయి. ఆయా సూత్రాలను అభిమానించేవాళ్ళు ఆయా శాఖలుగా (sects) అయ్యారు. శాఖా పక్షపాత కధ ఒకటి : జపాన్ దేశంలో Hogen అనే భిక్షువు అవతంసక సూత్ర (Garland Sutra) భక్తుడు. సూత్ర పఠనం జరిగే స్థలంలో దేవతలు గుమికూడుతారని నమ్మిక. Hogen సూత్రపఠనం పట్ల ప్రీతి చెంది ఒక దేవత రోజూ అతనికి ఆహారం తెచ్చి ఇచ్చేది. ఒకనాడు అతణ్ణి చూడడానికి అతని మిత్రుడు Renzo వచ్చాడు. Renzo సద్ధర్మపుండరీక (Lotus Sutra) భక్తుడు. కుశలప్రశ్నలు వేసుకొని కొంతసేపు మాట్లాడుకొన్నాక Renzo సెలవు తీసుకొంటూ లేచాడు. Hogen అతణ్ణి వెళ్ళనివ్వలేదు. “కాసేపు ఆగు. దేవతా భోజనం వస్తుంది. ఆరగించి వెళ్ళవచ్చు” అన్నాడు. Renzo కూర్చున్నాడు. సమయానికి సరిగ్గా భోజనం తెచ్చి అందించే దేవత ఆ దినం ప్రత్యక్షం కాలేదు. మిట్టమధ్యాహ్నం గడిచింది. భోజనం రాలేదు. మధ్యాహ్నం దాటితే బౌద్ధభిక్షువులు ఆహారం తీసుకోరాదు గనుక “ఇక ఈ వేళకి ఉపవాసమే” అంటూ Renzo లేచి తన నివాసానికి బయలుదేరాడు. Hogen ఆలోచనలో పడ్డాడు: “ఏమిటి ఈ రోజు ఇలా అయ్యింది? దేవత అనుగ్రహాన్ని కోల్పోయానా? లేక Renzo లో ఏమైనా

లోపం ఉండి దేవత రాలేదా?'' ఇలా నానా విధాలుగా చింతల పాలయ్యాడు. మరునాడు దేవత ప్రత్యక్షమయ్యింది. "నిన్న ఎందుకు భోజనం తీసుకరాలేదు?'' అని Hogen అడిగాడు. "అది నీ తప్పు. ఆ Renzo ని ప్రక్కన కూచోబెట్టుకొన్నావు. అతడు సద్ధర్మపుండరీకాన్ని ధారణ చేసి పారాయణం చేసేవాడు. అతడు ఎక్కడుంటే అక్కడ దేవతలు క్రిక్కిరిసి గుమికూడుతారు. నిన్న ఇక్కడ అలాగే అయ్యింది. నాకు లోనికి ప్రవేశించడానికి వీలుకానంత దేవతల రద్దీ వల్ల నేను లోనికి రాలేకపోయాను!''

ప్రజ్ఞాపారమిత సూత్రాలు చిన్నవి పెద్దవి చాలా ఉన్నాయి. శతసాహస్రిక (1,00,000 verses*), పంచవింశతి సాహస్రిక (25,000 verses), అష్టశత సాహస్రిక (18,000 verses), అష్టసాహస్రిక (8000 verses) అనేవి పెద్ద సూత్రాలు. వజ్రచ్ఛేదిక (Diamond Sutra in 300 verses) హృదయసూత్ర (Heart Sutra) అనేవి చిన్నవైనప్పటికీ చాలా ప్రసిద్ధమైనట్టివి. ప్రపంచంలో తొట్టతొలుతగా ముద్రితమైన పుస్తకం వజ్రచ్ఛేదిక సూత్రమే. చైనాలో క్రీ.శ. 748 లో ముద్రణ పొందింది. ప్రపంచ ప్రజల్లో ఎక్కువ సంఖ్యలో పారాయణం చేసే పవిత్రగ్రంథంగా వజ్రచ్ఛేదికకు ప్రసిద్ధి. హృదయసూత్రానికి కూడా అంతే ప్రసిద్ధి. Book workship అనేది ప్రజ్ఞాపారమిత విషయంలో పరాకాష్ఠ చెందిందని చెప్పవలసివస్తుంది. టిబెట్‌లో ఒక భక్తుడు శతసాహస్రిక ప్రజ్ఞాపారమిత గ్రంథంలో చుక్కలు (dots) కూడా లెక్కగట్టి మొత్తం 41,00,000 అని చెప్పాడు. క్రింద హృదయసూత్రాన్ని ఇంగ్లీషు అనువాదంతో ఇస్తున్నాను. ఇంగ్లీషు అనువాదం Donald S Lopez Jr చివర మంత్రానికి అర్థాన్ని Edward Conze నుండి గ్రహించాను. తెలుగులో అర్థాన్ని ఇచ్చే ప్రయత్నం చేయడం లేదు. మహాయాన సూత్రాల గాంభీర్యాన్ని అవగతం చేసుకొనే స్థాయిని అందుకొనే

---

* *గద్యమైనప్పటికీ ముప్పై రెండక్షరాలను ఒక యూనిట్‌గా లెక్కగట్టి verse అనేవారు ఆ రోజుల్లో లేఖకులకు రుసుము చెల్లించడానికి ఈ లెక్కలు అవసరమయ్యాయి*

ప్రయత్నంలో ఉంటాను. బుద్ధుని వాక్యాల మహిమను తలచుకొంటే ఆశ్చర్యం కలుగుతుంది. Shunchu అనే జపాన్ సాధువు ఏడుసార్లు చిల్లర దొంగతనాలు చేసి స్వయంగా పట్టుబడి జైలుకు వెళ్ళాడట. ఆయన సద్ధర్మపుండరీక (Lotus Sutra) భక్తుడు. సద్ధర్మ పుండరీక ఉపదేశాలను ఖైదీలకు బోధించడం కోసమే ఆయన జైలు ప్రవేశాన్ని ఏడుసార్లు స్వయంగా కల్పించుకొన్నాడు. Shunchu లాంటి దుఃఖభీరుత లేని ధర్మప్రచారకులుంటేనే సద్ధర్మం వికసిస్తుంది.



# ప్రజ్ఞాపారమిత హృదయ సూత్రం

*(Heart Sutra)*

*The Prologue*

ఏవం మయా శ్రుతమ్. ఏకస్మిన్ సమయే భగవాన్ రాజగృహే విహరతిస్మ గృధ్రకూటే పర్వతే మహతా భిక్షుసంఘేన సార్ధం మహతా చ బోధిసత్త్వసంఘేన. తేన ఖలు సమయేన భగవాన్ గంభీరావసంబోధం నామ సమాధిం సమాపన్నః. తేన చ సమయేన ఆర్యావలోకితేశ్వరో బోధిసత్త్వో మహాసత్త్వో గంభీరాయాం ప్రజ్ఞాపారమితాయాం చర్యాం చరమాణః ఏవం వ్యవలోకయతిస్మ. పంచస్కంధాంస్తాంశ్చ స్వభావశూన్యం వ్యవలోకయతి.

Thus did I hear at one time The Transcendent Victor was sitting on Vulture Peak in Rajagrha together with a great assembly of monks and a great assembly of Bodhisattvas At that time the Transcendent Victor was absorbed in a samadhi on the enumerations of phenomena called "perception of the profound" Also at that time, the Bodhisattva, the Mahasattva, the Superior Avalokitesvara was contemplating the meaning of the profound perfection of wisdom and he saw that those five aggregates also are empty of inherent existence

**Question and answer :**

అథాయుష్మాన్ శారిపుత్రో బుద్ధానుభావేన ఆర్యావలోకితేశ్వరం బోధిసత్త్వమేతదవోచత్-యః కశ్చిత్ కులపుత్రో గంభీరాయాం ప్రజ్ఞాపారమితాయాం

చర్యాం చర్తుకామః కథం శిక్షితవ్యః ? ఏవముక్తే ఆర్యావలోకితేశ్వరో బోధిసత్త్వో మహాసత్త్వః ఆయుష్మంతం శారిపుత్రమేతదవోచత్-యః కశ్చిచ్ఛారిపుత్ర కులపుత్రో వా కులదుహితా వా గంబీరాయాం ప్రజ్ఞాపారమితాయాం చర్యాం చర్తుకామః తేనైవం వ్యవలోకితవ్యం. పంచస్కంధాంస్తాంశ్చ స్వభావశూన్యాన్ సమనుపశ్యతిస్మ.

Then, by the power of the Buddha, the Venerable Sariputra said this to the Bodhisattva, the Mahasattva, the Superior Avalokitesvara "how should a son of good lineage train who wishes to practice the profound perfection of wisdom?"

The Bodhisattva, the Mahasattva, the Superior Avalokitesvara said this to the venerable Sariputra "Sariputra, a son of good lineage or a daughter of good lineage who wishes to practice the profound perfection of wisdom should view (things) in this way They should correctly view those five aggregates also as empty of inherent existence.

**Form is Emptiness; Emptiness is Form :**

రూపం శూన్యతా, శూన్యతైవ రూపం. రూపాన్న పృథక్ శూన్యతా, శూన్యతాయా న పృథక్ రూపం. యద్రూపం సా శూన్యతా, యా శూన్యతా తద్రూపం. ఏవం వేదనా సంజ్ఞా సంస్కార విజ్ఞానాని చ శూన్యతా. ఏవం శారిపుత్ర సర్వధర్మాః శూన్యతాలక్షణా అనుత్పన్నా అనిరుద్ధా అమలా విమలా అనూనా అసంపూర్ణాః.

Form is emptiness; emptiness is form Emptiness is not other than form, form is not other than emtiness. In the same way, feelings, discrimination, compositional factors and consciousness are empty Sariputra, in that way all phenomena are empty, without characteristic, unproduced, unceased,

stainless, not stainless, undiminished, unfulfilled

**Negations and Enlightenment :**

తస్మాత్తర్హి శారిపుత్ర శూన్యతాయాం న రూపం, న వేదనా, న సంజ్ఞా, న సంస్కారాః, న విజ్ఞానం. చ చక్షుర్న శ్రోతమ్ న ఘ్రాణం న జిహ్వా న కాయో న మనో న రూపం న శబ్దో న గంధో న రసో న స్ప్రష్టవ్యం న ధర్మాః. న చక్షుర్ధాతుర్యావన్న మనోధాతుర్న ధర్మధాతుర్న మనోవిజ్ఞానధాతుః. న విద్యా నావిద్యా న క్షయో యావన్న జరామరణం న జరామరణక్షయః, న దుఃఖసముదయ నిరోధమార్గా న జ్ఞానం న ప్రాప్తిర్నాప్రాప్తిః. తస్మాచ్ఛారిపుత్ర అప్రాప్తిత్వేన బోధిసత్వానాం ప్రజ్ఞాపారమితామాశ్రిత్య విహరతి చిత్తావరణః. చిత్తావరణనాస్తిత్వాదత్రస్తో విపర్యాసాతిక్రాంతో నిష్ఠనిర్వాణః త్ర్యధ్వవ్యవస్థితాః సర్వబుద్ధాః ప్రజ్ఞాపారమితామాశ్రిత్య అనుత్తరాం సమ్యక్సం బోధిమభిసంబుద్ధాః

Therefore, Sariputra, in emptiness there is no form, no feelings, no discrimination, no compositional factors, no consciousness, no eye, no ear, no nose, no tongue, no body, no mind, no form, no sound, no odor, no taste, no object of touch, no phenomenon. There is no eye constituent, no mental constituent, up to and including no mental consciousness constituent There is no ignorance, no extinction of ignorance, up to and including no aging and death and no extinction of aging and death Similarly, there are no sufferings, no origins, no cessations, no paths, no wisdom, no attainment, and also no non-attainment

Therefore, Sariputra because Bodhisattvas have no attainment they depend on and abide in the perfection of wisdom and their minds are without obstruction and without fear. Having completely passed beyond all error they

go to the completion of nirvana. All the Buddhas who abide in the three times have been fully awakened into unsurpassed, perfect, complete enlightenment through relying on the perfection of wisdom.

**The Mantra★ :**

తస్మాద్. జ్ఞాతవ్యః ప్రజ్ఞాపారమితామహామంత్రః అసమసమమంత్రః సర్వదుఃఖ ప్రశమనమంత్రః సత్యమమిధ్యత్వాత్ ప్రజ్ఞాపారమితాయాముక్తో మంత్రః. తద్యథా- గతే గతే పారగతే పారసంగతే బోధి స్వాహా

Therefore, the mantra of perfection of wisdom is the mantra of great knowledge, the unsurpassed mantra, the mantra equal to the unequalled, the mantra that thoroughly pacifies all suffering. Because it is not false it should be known to be true. The mantra of the perfection of wisdom is stated
గతే గతే పారగతే పారసంగతే బోధి స్వాహా

**The epilogue :**

ఏవం శారిపుత్ర గంభీరాయాం ప్రజ్ఞాపారమితాయాం చర్యాయాం శిక్షితవ్యం బోధిసత్త్వేన

---

★ *Edward Conze* చెప్పిన మంత్రార్థం ·

గతే *(gone) from the data of common sense to the dharmas and their emptiness*

గతే *(gone) - from the infatuation with conditioned dharmas to their renunciation because of their emptiness*

పారగతే *(gone beyond) - to the unconditioned and to it's emptiness*

పారసంగతే *(gone altogether beyond) - even beyond the difference between the world and Nirvana to a transcendent non-duality in which affirmation and negation are identified in one emptiness*

బోధి స్వాహా *(O what an awakening!) - the final stage of transcendent emptiness, in which the long sleep is at last over*

అథ ఖలు భగవాన్ తస్మాత్సమాధేర్వ్యుత్థాయ ఆర్యావలోకితేశ్వరస్య బోధిసత్త్వస్య సాధుకారమదాత్-సాధు సాధు కులపుత్ర! ఏవమేతత్ కులపుత్ర, ఏవమేతద్ గంభీరాయాం ప్రజ్ఞాపారమితాయాం చర్యం చర్తవ్యం యథా త్వయా నిర్దిష్టమ్ అనుమోద్యతే తథాగతైరర్హద్భిః

ఇదమవోచద్భగవాన్. ఆనందమనా ఆయుష్మాన్ శారిపుత్రః ఆర్యావలోకితేశ్వరశ్చ బోధిసత్త్వః సా చ సర్వావతీ పరిషత్ సదేవమానుషాసురగంధర్వశ్చ లోకో భగవతో భాషితమభ్యనందన్.

ఇతి ప్రజ్ఞాపారమితాహృదయసూత్రం సమాప్తమ్

Sariputra, Bodhisattva Mahasattvas train in the profound perfection of wisdom in that way

Then the Transcendent Victor rose from that Samadhi and said to the Bodhisattva, the Mahasattva, the Superior Avalokitesvara, "well done, well done child of good lineage, it is just so Even that Tathagatas admire this' The Transcendent Victor having so spoken, the venerable Sariputra, the Bodhisattva, the Mahasattva, the Superior Avalokitesvara, and all those surrounding and those of the world, the gods, humans, demigods, and gandharvas, were filled with admiration and praised the words of the Transcendent Victor

# మధ్యమక శాస్త్రం మీద 32 అపార్థాలు

*(Misconceptions)*

బౌద్ధంలో ఏ శాస్త్రమైనా సరే బుద్ధుని వాక్యాలను అర్థం చేసుకొనే ప్రయత్నంగానే ఉంటుంది. కనిష్కుని కాలంలో భదంత వసుమిత్రుని అధ్యక్షతన అనేక వందలమంది బౌద్ధాచార్యులు ఒక చోట కూర్చొని కొన్నేండ్లు చర్చలు చేసి మహావిభాషాశాస్త్రాన్ని రచించారు. అనేక విషయాల్లో ఈ శాస్త్రంతో విభేదించినవాళ్ళు సౌత్రాంతికులయ్యారు. ఈ ఇరువురిని కాదని నాగార్జునుడు మధ్యమక శాస్త్రాన్ని రచించాడు. కనుక నాగార్జునుని శాస్త్రం అర్థం కావాలంటే ముందుగా ప్రాచీన ఆచార్యులైన వైభాషిక సౌత్రాంతికులను అర్థం చేసుకోవాలి. వైభాషిక సౌత్రాంతికుల భావాలను ద్వితీయ బుద్ధుడుగా కీర్తి కెక్కిన ఆచార్య వసుబంధు చాలా చక్కగా అభిధర్మకోశంలో వివరించారు. బౌద్ధం మీద ఏమి వ్రాయాలన్నా అభిధర్మకోశభాష్య అధ్యయనం తప్పనిసరి. నేను మూల సంస్కృత గ్రంథాన్ని, ఇంగ్లీషు అనువాదాన్ని సంపాయించి పెట్టుకొన్నాను కానీ ఇంకా అధ్యయనంలోకి దిగలేదు. దీని అధ్యయనం అయ్యాకనే మధ్యమక శాస్త్రాన్ని తెనిగించే ప్రయత్నం చేస్తాను.

"My aim is . to teach you to pass from a piece of disguised nonsense to something that is patent nonsense" - Wittgenstain

పుస్తకాల్లోని పదాల వెనుక దాగి ఉన్న nonsenseని బైటకు లాగడమే నాగార్జునుని ఉద్దేశంగానూ కనిపిస్తుంది. nonsense పుస్తకాలు కేవలం ప్రచారం వల్ల, నూరిపోసిన అభిమానాల వల్ల మనుగడ సాగిస్తున్నాయి. నేడు మానవుడు బ్రతుకు కోసం useful skills చాలా సంపాయించుకొనవలసిన అవసరం ఉన్నది. వ్యర్థగ్రంథాల

పఠనాసక్తిని మధ్యమకం తగ్గించి practical fieldsకి మానవుణ్ణి మళ్ళిస్తుందని నా భావన.

Jeffrey Hopkings రచించిన Meditation on Emptiness అనే గ్రంథంలోని అపార్థాల పట్టికను క్రింద ఇస్తున్నాను. శాంతిదేవుని బోధిచర్యావతారంలోని 9వ అధ్యాయాన్ని వదలివేయడానికి కారణం అపార్థాలు కలిగిస్తానేమో అనే భయం వల్లనే. ప్రాచీనులకు అర్వాచీనులకు కూడా మధ్యమకం కొఱకరాని కొయ్యగా ఉన్న విషయాన్ని Seyfort Ruegg అనే గొప్ప బౌద్ధపండితుని క్రింది వాక్యాల ద్వారా తెలుసుకోవచ్చును.

Over the past half century the doctrine of the Madhyamaka school and in particular that of Nagarjuna, has been variously described as Nihilism, Monism, Irrationalism, Misology, Agnosticism, Scepticism, Relativism, Dialectic, Mysticism, Acosmism, Absolutism with therapeutic value

ఇక అపార్థాల పట్టిక :

1 Their outlook is nihilistic, agnostic, or sceptic.

2 They are anit-reason.

3. The uncommon view of the system is that words are inadequate to evoke an experience of objects like that of direct perception

4 They have no system, no views on cause and effect or rebirth, no positive theses, and no negative theses.

5 They are merely debaters

6 Wisdom is emptiness

7 Wisdom is contentless.

8 Emptiness is the Absolute

9 The two truths are two ways of viewing the same object

10. That objects possess a definite nature is the object of negation in the view of emptiness.

11. Their system is a turning away from philosophical analysis to the vulgar views of the world

12 All views are bad

13. Withdrawal from thought is the best meditation. Or, words are enemies Or, the source of all suffering is words

14 Reasoning is used only to refute other systems

15 What is seen in direct sense perception is the truth, what the senses reveal cannot be denied in any way; one must appreciate the uncommon thingness of each phenomenon as its suchness.

16. Direct perception of suchness requires a leap.

17. There is no I at all

18. The selflessness of person denies the existence of persons

19. Conventional truths are established only by ignorance

20. Conceptuality is ignorance.

21. Nagarjuna's Treatise on the Middle way must be viewed in isolation

22. Emptiness does not exist.

23. Form is one with emptiness.

24 Nagarjuna did not set forth the path

25 Teachings about the path are for those of low intelligence

26 Dependent-arising and emptiness are one.

27 Emptiness and dependent-arising are a paradox

28 None of Hinayana categories are accepted

29 Analysis is not meditation

30 Meditation is just stabilization

31 Phenomena are whatever one thinks they are

32 Conventional truths are negated by ultimate truths

## తుదిపలుకు :

బుద్ధవచనం (*teachings of Buddha*) విస్తారంగా ఉండడం వల్ల కొంత గందరగోళానికి అవకాశం ఉన్నది. ఈ గందరగోళాన్ని నివారించడానికై తరువాతి కాలంలో కొన్ని మంచి ప్రయత్నాలు జరిగాయి. అలాంటి ప్రయత్నాల్లో మిళిందపన్హ (మిళిందుని ప్రశ్నలు) మనోరంజకమైన ఒక గొప్ప ప్రయత్నం. నాగసేనుడు అనే బౌద్ధ భిక్షువుకు మిళిందుడనే రాజుకు మధ్య జరిగిన సంభాషణ రూపం. పిచ్చాపాటి సంభాషణ కాకుండా ప్రాచీన బౌద్ధాన్ని కరతలామలకం చేసే విధంగా ఉంటుంది. వందేండ్లకు ముందే దీనిని *Rhys Davids* ఇంగ్లీషులోకి అనువదించారు. తెలుగులో ఇంతవరకు ఈ గ్రంధాన్ని ఎవరూ పట్టించుకొన్నట్లు లేదు యధాతధంగా అనువదించాలనుకొంటున్నాను ఒక సంవత్సరం పట్టవచ్చు

# బౌద్ధపారిభాషిక పద సూచిక

Bhikkhu Nanamoli అనువదించిన విశుద్ధిమగ్గ (path of purification) పుస్తకం నుండి ఈ పట్టికను సంగ్రహించాను. అకారాది క్రమం కొన్ని చోట్ల తప్పినట్లుగా ఉండవచ్చు. కారణం పాళీ పదాలను సంస్కృతీకరణం చేసినందువల్ల. ఈ పట్టిక సాధారణ పట్టిక. బోధిచర్యావతారంలో ఈ పదాలన్నీ ఉన్నాయని చెప్పడం కాదు.

అక్రియాదృష్టి = (moral) inefficacy of action view

అకుశల = non-virtuous, unskilful, unprofitable

అధ్యాత్మ = internally, in one self

ఆజ్ఞా = final knowledge (in the Arahant)

ఆత్మభావ = person, personality, selfhood, rebirth

అర్థ = benefit, result, purpose, aim, goal, meaning

అదత్తాదాన = taking what is not given, stealing

అధ్వా, అధ్వాన = extent, period

అధికార = treatise, heading

అధికృత్య = as an integral part of, dependent on

అధిచిత్త = higher consciousness

అధిప్రజ్ఞ = higher understanding (insight)

అధిశీల = higher virtue (virtue as basis for dhyana and insight)

అభిప్రాయ = intention, purport

అనాత్మ = not-self

అనాగత = future

అనిత్య = impermanent

అనిమిత్త = signless

అనునయ = approval

అనుపాలన = maintenance

అనుబోధ = idea, ideation

అనుభావ = power, influence

అనులోమ = in conformity with, in forward order

అనుశయ = inherent tendency

అనుస్మృతి = recollection

అనపత్రాప్య = shamelessness

అన్వయజ్ఞాన = inferential knowledge

అపర్యాపన్న = unincluded

అపరిసంస్థిత = turbulent
అపవారిత = opened up
అపాయ = state of loss
అప్రణిహిత = desireless
అర్పణ = absorption
అప్రమాణ = measureless state, divine abiding
ఆప్యాయతి = to satisfy
అల్పేచ్ఛతా = fewness of wishes
అభావ = absence, non-existence, non-entity
అభిఘాత = impact
అభిద్య = covetousness
అభిజ్ఞ = super knowledge
అభినందన = delight
అభినిరూపణ = directing on to
అభినివేశ = insistence
అభినిర్హార = conveying, guidance
అభిభవ్యాయతన = base for transcending the sense desire sphere
అభిసంస్కార = volitional formation, karma formation, momentum
అభిసమయ = penetration to, convergence upon four noble truths
అమృత = deathless = Nirvana
అమోహ = non-delusion
అరతి = aversion, boredom
ఆర్య = noble, noble one (one who has attained the path)
అరూప = immaterial
అలోభ = non-greed
అలీన = unsheltered
అవస్కంధన = hiatus
అవగ్రహ = grasping
అవస్థా = occasion, position
అవధాన = attention
అవధి = limit
అవబోధ = awareness, discovery
అవిక్షేప = non-distraction
అవిద్య = ignorance
అవ్యాపాద = non ill-will
అసంమోహ = non-delusion, non-confusion
అశుభ = foul, ugly
అశ్వాస ప్రశ్వాస = in-breath and out-breath
అహ్రీ = consciencelessness
అహేతుకదృష్టి = no-cause view
ఆకార = mode, aspect, structure
అకించన = nothingness
ఆదాన = grasping, taking
ఆదీనవ = danger, disability
ఆపత్తి = offence
ఆభోగ = concern
ఆయతన = base
ఆవ్యూహన = occumulation of karma
ఆరంభణ = object of consciousness, support (ఆలంబన)
ఆలోక = light
ఆసవ = canker

| | | |
|---|---|---|
| ఆసేవన | = | cultivation, repetition |
| ఇష్ట | = | desirable |
| ఋద్ధి | = | power, supernatural power |
| ఋద్ధిపాద | = | road to power, basis for success |
| ఇంద్రియ | = | faculty |
| ఈర్యాపథ | = | posture, deportment |
| ఉచ్ఛేదదృష్టి | = | annihilation view |
| ఉదయ వ్యయ | = | rise and fall |
| ఔద్ధత్య | = | agitation |
| ఉపక్లేశ | = | imperfection |
| ఉపస్థాన | = | establishment |
| ఉపధారణ | = | upholding |
| ఉపపత్తి | = | reappearance, re-birth |
| ఉపబృంహణ | = | intensification |
| ఉపభుంజక | = | experiencer, user |
| ఉపశమ | = | peace |
| ఉపాదాన | = | clinging |
| ఉపాయ | = | means |
| ఉపాయాస | = | despair |
| ఉపేక్ష | = | equanimity |
| ఉపపత్తిభవ | = | re-birth process, becoming, being as a result of action |
| ఉత్పాద | = | prominence |
| ఉత్సాహ | = | activity |
| ఏకాగ్రత | = | unification of consciousness |
| ఏషణ | = | search |
| ఓఘ | = | flood |
| ఓజస్ | = | nutritive-essence |
| ఉపపాదుక | = | apparitionally reborn |
| ఆభాస | = | illumination |
| ఔదారిక | = | gross |
| కల్ప | = | aeon |
| కర్మ | = | deeds, action, work |
| కర్మస్థాన | = | meditation subject |
| కర్మపథ | = | course of action |
| కల్యాణపృథక్జన | = | magnanimous ordinary person |
| కాసినా (కృత్స్న) | = | a contemplation device |
| కామ | = | sense desire, sexual desire |
| కామచ్ఛంద | = | lust, zeal for sense desires |
| కామరాగ | = | greed for sense desires |
| కామఅవచర | = | sense sphere |
| కామేషు మిథ్యాచార | = | sexual misconduct |
| కారక | = | doer |
| కాయ | = | body, group, order |
| కాయసాక్షి | = | body witness |
| కించన | = | owning, owner-ship (అకించన not owning anything) |
| క్లేశ | = | affliction, defilement |
| కుహన | = | scheming |
| క్షణ | = | moment, instant |
| స్కంధ | = | aggregate |
| గతి | = | destiny, destination on rebirth |
| గోచర | = | resort, domain, scope |
| గోప | = | guardian |

| | | |
|---|---|---|
| చరిత | = | temperament |
| చారక | = | prison |
| చింత | = | reasoning |
| చ్యుతి | = | death |
| చేతన | = | volition |
| ఛంద | = | zeal |
| తృష్ణ | = | craving |
| దృష్టి | = | view |
| దివ్యచక్షు | = | divine eye |
| దుర్గతి | = | unhappy destination |
| దుశ్చరిత | = | misconduct, misbehaviour |
| దౌష్కుల్య | = | inertia |
| దేశన | = | teaching, instruction |
| దౌర్మనస్య | = | grief |
| ద్వాత్రింశత్ ఆకార | = | 32 aspects of the body |
| ధర్మ | = | law discovered by Buddha, thing, phenomenon, mental object, mental datum |
| ధర్మానుసారి | = | devotee of Dharma |
| ధూతాంగ | = | ascetic practices |
| ధ్రువ | = | everlasting |
| నంది | = | delight |
| నయ | = | method |
| నామ | = | mentality, name |
| నిత్య | = | permanent |
| నిర్జీవ | = | soulless |
| నిర్వాణ | = | extinction of greed, hate and delusion |
| నిర్వికల్ప | = | without thinking |
| నిర్వేద | = | dispassion, revulsion |
| నిర్వేధ | = | penetration |
| నిమిత్త | = | sign |
| నియతివాద | = | determinism, fatalism |
| నిరుక్తి | = | language |
| నిరోధ | = | cessation |
| నిశ్రయ | = | support |
| నిస్సత్త్వ | = | not a living being |
| నిస్సరణ | = | escape from defilement by Nirvana |
| నీవరణ | = | hindrances |
| నైష్కర్మ్య | = | renunciation |
| ప్రకాశ | = | illumination |
| ప్రత్యాత్మ | = | for oneself |
| ప్రత్యవేక్షణ | = | reviewing |
| ప్రజ్ఞప్తి | = | making known, announcement, appellation, designation, concept, description |
| ప్రజ్ఞ | = | understanding (insight) |
| ప్రజ్ఞావిముక్త | = | one liberated by understanding |
| ప్రతికూల | = | repulsive |
| ప్రతిఘ | = | resentment, resistance |
| ప్రతిజ్ఞ | = | claim |
| ప్రతిపత్తి | = | way, progress, practice |
| ప్రతిసంధి | = | rebirth-linking consciousness |
| ప్రణిధి | = | aspiration |
| ప్రణీత | = | superior, sublime |
| ప్రధాన (ప్రహాణ) | = | endeavour, effort |
| పరికథ | = | round about talk |
| పరికర్మ | = | preliminary work |
| పరిష్కార | = | equipment, requisite |

| | | |
|---|---|---|
| పరీత్త | = | small, limited |
| పరిభోగ | = | use |
| పరిహారవచన | = | explanation |
| పలిబోధ | = | impediments |
| ప్రవిచయ | = | investigation |
| ప్రవివేక | = | seclusion |
| ప్రసాదన | = | confidence, clarification |
| ప్రస్రబ్ధి | = | tranquility |
| ప్రహాణ | = | abandoning |
| ప్రాణాతిపాత | = | killing living beings |
| పైశున్యం | = | malicious speech |
| బోధి | = | enlightenment, awakening |
| బోధిసత్త్వ | = | Being destined to enlightenment |
| బ్రహ్మవిహార | = | divine abiding |
| భవ | = | becoming |
| భావన | = | development |
| మనసికార | = | attention, bringing of mind |
| మోహ | = | delusion |
| యధాభూత | = | correct |
| యుగనద్ధ | = | coupling, yoking of serenity and insight |
| యోనిశో | = | wise, wisely, with ordered reasoning |
| రతి | = | delight |
| లోకోత్తర | = | supra mundane |
| వ్రత | = | ritual, vow, duty |
| వికల్ప | = | alternative |
| విష్కంభణ | = | suppression |
| విచార | = | sustained thought |
| వితర్క | = | applied thought |
| విపరిణామ దుఃఖ | = | suffering due to change |
| విపర్యాస | = | perversion |
| విపశ్యన | = | insight (the vision of what is formed as impermanent, painful, not-self, |
| విపాక | = | (karma) result |
| విరతి | = | abstinence |
| విముక్తి | = | deliverance |
| విభవ | = | non-being, non-becoming |
| విరమ | = | abstaining |
| వీర్య | = | energy |
| విషాద | = | dejection |
| విహార | = | dwelling place, abode, monastery, mode of abiding |
| విహింస | = | cruelty |
| మీమాంస | = | enquiry |
| వేదన | = | feeling |
| వేదక | = | experiencer |
| వ్యాపాద | = | ill-will |
| సంయోజన | = | fetter |
| సంవర | = | restraint |
| సంవేగ | = | sense of urgency |
| సంసార | = | round of rebirths |
| సత్కాయ దృష్టి | = | individuality view |
| సంక్రాంతి | = | transmigration |
| సంకల్ప | = | thinking |
| సంస్కారదుఃఖ | = | suffering due to formations |

సత్యానులోమిక జ్ఞాన = knowledge in conformity with truth

సాక్షిక్రియ = realization

సంజ్ఞ = perception, sign

సంస్థాన = shape

సతి (స్మృతి) = mindfulness

సత్త్వ = a being, living being

శ్రద్ధానుసారి = faithful devotee

శ్రద్ధావిముక్తి = one liberated by faith

సనిదర్శన = visible

శాంతిపద = state of peace (Nirvana)

సంతీరణ = investigation

సంధారణ = upholding

సన్నిపాత = concurrence

స్వభావ = own being

శమధ = serenity

సమాధి = concentration

సమాపత్తి = attainment

సంప్రజన్య = full awareness

సంభిన్న ప్రలాప = gossip, idle chatter

సంవృతి = convention, conventional



ులోమిక = knowledge in conformity with truth

మ = realization

= perception, sign

ర = shape

స్మృతి) = mindfulness

= a being, living being

ంసారి = faithful devotee

ముక్తి = one liberated by faith

ృన = visible

ంద = state of peace (Nirvana)

ా = investigation

రణ = upholding

త = concurrence

= own being

= serenity

= concentration

త్తి = attainment

ఃన్య = full awareness

ప్రలాప = gossip, idle chatter

ి = convention, conventional

సంవృతిసత్య = conventional truth

స్వలక్షణ = specific characteristic (e g hardness of Earth)

శ్రవణ = hearing

శాశ్వత = eternal

శ్రామణ్యఫల = fruit of asceticism

శ్రావక = disciple, hearer

శాసన = despensation

శిక్ష = training

శిక్షాపద = training precept

శీల = virtue, habit, rite

సుఖ = pleasure, pleasant, bliss, blissful, bodily pleasure

సుగత = sublime one

శూన్య = emptiness, void

శుభ = beautiful, beauty

శైక్ష = trainee

శోక = sorrow

స్రోతాపన్న = stream enterer

సౌమనస్య = joy, mental pleasure

హ్రీ = conscience



ఆనంద బుద్ధ విహార ట్రస్ట్

బౌద్ధ ధర్మానికి, సంస్కృతికి అంకితమైన ధర్మ (



నమో తస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధ


**ఆనంద బుద్ధ విహార ట్రస్ట్**

సాయినగర్ తుకారాంగేట్, నార్త్ లాలాగూ(

సికింద్రాబాద్ - 500 017 ఎ.పి., ఇండియా